Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    స్థాపితం: 1930    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 14 • 8-4-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# నడిచే దేవుడు కోలుకోవాలి!



సత్య సాయిబాబా అనారోగ్యం ప్రపంచ వ్యాప్తంగా వున్న కోట్లాది మంది భక్తులలో తీవ్ర ఆందోళన, ఆవేదన కల్గిస్తున్నది. కొన్ని లక్షల కుటుంబాలలో మూడు నాలుగు రోజుల నుంచి పొయ్యి వెల్గడం లేదు. తిండి తిప్పలు మాని సాయి ధ్యానంలో నిమగ్నమై పోయి వున్నారు. బాబాలో భగవంతుడిని చూసుకొని బ్రతికే వారంతా, ఆయన మరణిస్తున్నాడన్న భావనే భరించ లేక పోతున్నారు. ఆయన లేని జీవితం వ్యర్ధమన్న నిస్పృహతో సతమతమౌతున్నారు. ఏదో ఒక విచిత్రం జరిగి, బాబా మామూలు ఆరోగ్యంతో బయటకు వస్తాడని, తమకు మళ్లీ దర్శనమిస్తాడనే ఆశ వారిలో ఏదో ఒక మూల కొట్టుకలాడుతున్నా, ఆస్పత్రి నుంచి వెలువడుతున్న వార్తలు వారిని తీవ్ర మనోవేదనకు గురి చేస్తున్నది. సత్యసాయి బాబా గతంలో ఒకసారి తాను 96ఏళ్ల వయస్సు వరకు దర్శనమిస్తూనే వుంటానని చెప్పాడట. ఆయన చెప్పిన ఏ మాట కూడా అసత్యం కాలేదు కాబట్టి, ఇప్పటి అనారోగ్యం ఆయన్ను ఏమీ చేయదన్న ఆశ భక్తులలో కొట్టాడుతున్నది.

సత్యసాయి బాబా, కోట్లాది మంది దృష్టిలో భగవంతుడి అవతారం. ఆయన మహిమల మీద వారికి గుడ్డి నమ్మకం. తమ జీవితాలకు కొత్త అర్ధం చూపుతాడని, తమ బాధలు తొలగిస్తాడని మనసా వాచా కర్మణా నమ్ముతారు ఆయన భక్తులు. తామెక్కడ వున్నా బాబా తమ వెంటే వున్నాడన్న భావంతో మెలగుతుంటారు. నిత్యం ఆయన నామ స్మరణ చేస్తూ వుంటారు. దాదాపు 178 దేశాలలో బాబాకు భక్తులున్నారు. నిజానికి సత్య సాయిబాబా తన జీవిత కాలంలో దేశం పొలిమేర్లు దాటి వెళ్లలేదు. ఏ దేశంలోనూ పర్యటించలేదు. కానీ ప్రపంచమంతా ఆయన మహిమలు విస్తరించి వున్నాయి. మన దేశంలో కంటే విదేశాలలోనే ఆయన మీద అమితమైన, అలివిమాలిన భక్తి వుండడం విచిత్రం. బాబా కోరితే తమ ఆస్తి పాస్తులన్నీ ధార పోసిన వారెందరో వున్నారు. సుదూర దేశాల నుంచి పుట్టపర్తికి వచ్చి, నెలల పర్యంతం ఆ చిన్న గ్రామంలోనే సాధారణ జీవితం గడుపుతూ, ఒక్కసారి బాబా దర్శనం

కొరవ 14వ పేజీలో

# కడప ఎన్నికనే ధ్యాస, శ్వాస!

● **మూడు పార్టీలలోనూ అదే పరిస్థితి.**

రాష్ట్ర రాజకీయం సమస్తం కడప ఉప ఎన్నికల మీదనే కేంద్రీకృతమౌతున్నది. కాంగ్రెస్, తెలుగుదేశం, జగన్ పార్టీలు మూడింటికీ అదే ధ్యాస, అదే శ్వాస. వేరొక పనిలేదు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, టిడిపి అధినేత చంద్రబాబు నాయుడు, వైఎస్ జగన్‌లు ముగ్గురూ ఈ ఎన్నికల కోసం వ్యూహ ప్రతివ్యూహాలు రచించే పనిలో పూర్తిగా నిమగ్నమై వున్నారు. రాష్ట్ర రాజకీయ భవిష్యత్తును నిర్ణయించే శక్తి వీటికి వుండడమే అందుకు కారణం.

ఎవరెన్ని చెప్పినా, వైఎస్ జగన్ ఒక ప్రబల రాజకీయ శక్తి అన్నది కాదనలేని సత్యం. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి సానుభూతిని రాజకీయ వరప్రసాదంగా మలచుకొనే విద్యలో జగన్ అపూర్వమైన ప్రతిభ కన్పరుస్తున్నాడు. నూట పాతికేళ్ల కాంగ్రెస్ పార్టీకి, 30 ఏళ్ల తెలుగుదేశం పార్టీకి వెన్నులో చలి పుట్టిస్తున్నాడు. జగన్ పార్టీ ఇదే శక్తియుక్తులతో రేపటి సాధారణ ఎన్నికలలో రంగంలో నిలిస్తే తమ భవిష్యత్తు ఏమిటా అన్న ఆందోళన రెండు ప్రధాన పార్టీలలోనూ ప్రస్ఫుటంగా కన్పిస్తున్నది. జగన్ ప్రభావాన్ని కొంతకు కొంతైనా తగ్గించాలంటే, ఆయన రాజకీయ ప్రభంజనాన్ని నైతికంగా దెబ్బతీయాలంటే కడప ఉప ఎన్నికలే మార్గం. అక్కడ జగన్‌ను నిలువరించగల్గితే, రేపటి ఎన్నికలలో ఆయన ప్రభావం లేకుండా చూసుకోవచ్చునన్న వ్యూహంతో కాంగ్రెస్, టిడిపి పార్టీలు రెండూ నిద్రాహారాలు మాని కసరత్తు చేస్తున్నాయి. అయితే విషాదమల్లా వారిద్దరికీ సరైన అభ్యర్థి దొరకక పోవడం.

పులివెందుల శాసనసభ స్థానానికి వైఎస్ తమ్ముడు వివేకానందరెడ్డిని నిలపడం ద్వారా జగన్ మీద ఒక మెట్టు పైచేయి సాధించింది కాంగ్రెస్ పార్టీ. కానీ నేరుగా జగన్ మీద లోక్‌సభ స్థానానికి నిలబడడానికి కాంగ్రెస్ నేతలెవరూ ముందుకు రాలేదు. డిఎల్ రవీంద్రారెడ్డి, వరదరాజులు రెడ్డి, తులసిరెడ్డి వంటి యోధానుయోధులంతా వెనుకంజ వేశారు. దానితో సిగ్గు విడిచి టిడిపి నేత మైసూరారెడ్డికి ఆహ్వానం పలికారు. కానీ ఆయన్ను చంద్రబాబునాయుడు వడేసి పట్టుకొని, తమ పార్టీ అభ్యర్థిగా నిలబెట్టారు. ఇక ఏ దారీ కన్పించక, మరొక టిడిపి నేత కందుల రాజమోహనరెడ్డిని రంగంలోకి దింపబోతున్నది కాంగ్రెస్ పార్టీ. అందుకుగాను ఆయన గొంతెమ్మ కోర్కెలు తీర్చడానికి సిద్ధపడుతున్నారు. ఒకవేళ ఈ ఎన్నికలలో ఓడిపోతే తనకు రాజ్యసభ సభ్యత్వం ఇవ్వాల

కొరవ 14వ పేజీలో



## కార్టూన్ స్కేప్




దాహం నీ ఒక్కడికే అనుకున్నావా,
నాయకుల్లో కొందరికి ధనదాహం,
మా చిన్నసారుకైతే అధికార దాహం!!

# క్రికెట్ కిరీటం

క్రికెట్ ప్రపంచ కప్ గెలుపు సమస్త భారత దేశాన్ని ఆనంద డోలికలలో ముంచెత్తింది. అదేమి సంతోషం, అదేమి సంబరాలు? యావత్ దేశం విజయ గర్వంతో పూగిపోయిందనడం అతిశయోక్తి కాదు. కాశ్మీర్ నుంచి కన్యాకుమారి దాకా, అహ్మదాబాద్ నుంచి అగర్తలా వరకు ప్రతి పట్టణంలో, ప్రతి పల్లెటూరులో కేరింతలు, ఆనంద తాండవాలు, తిరునాళ్ల సందడి. కోట్లాది మంది ప్రజలు ఏదో యుద్ధంలో గెలిచిన వారి వలె పండుగ చేసుకొన్నారు. శ్రీలంకతో పోరాడి ప్రపంచ కప్ సాధించిన దానికంటే అధికంగా పాకిస్తాన్ మీద సెమీ ఫైనల్స్‌లో గెలిచిన రోజు మరింత ఆనందం వ్యక్తమైంది. ఆ రాత్రి దేశం మొత్తంలో దీపావళి శోభ తాండవించింది.

సాధారణ ప్రజలతో పాటుగా రాజకీయ నేతలు, పారిశ్రామిక దిగ్గజాలు, సినీ కళాకారులు, వున్నతాధికారులు, దౌత్య ప్రముఖులు కూడా ఆ రెండు రోజుల్లో తమ వ్యాపకాలు మానుకొని క్రీడా మైదానంలో కేరింతలు కొట్టడం ఈ ఆట పట్ల మన దేశంలో పెరిగిపోతున్న మోజుకు ఒక సంకేతం. ప్రధాని మన్మోహన్‌సింగ్, రాష్ట్రపతి శ్రీమతి ప్రతిభా పాటిల్, కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీ, బిజెపి అగ్రనేత ఎల్‌కె.అద్వానీ, ప్రపంచ కుబేరుడు ముఖేష్ అంబానీ వంటి వారంతా ఆట జరిగినంత సేపూ స్టేడియంలోనే మకాం పెట్టి, సాధారణ ప్రజలతో పాటుగా కేరింతలు కొట్టడం పెద్ద విశేషం.

లక్షల కోట్ల రూపాయల స్కాములు, పంచాయితీ స్థాయి నుంచి ప్రధాన మంత్రి కార్యాలయం వరకు కుంభకోణాలు, అల్లర్లు, రాజకీయ ఆగాలతో దేశం మొత్తం మీద ప్రజలలో ఒక విధమైన అశాంతి, నిరాశ, ఏదో తెలియని అయోమయం నెలకొని వున్న సమయంలో ఈ క్రికెట్ ఆట, మనసులకు చెప్పలేని వూరట కల్పించిందనడం నిజం. ఒకటి రెండు రోజులైనా జనం అవన్నీ మరిచిపోయి పండుగ చేసుకొన్నారు. యువతరంలో దేశభక్తి క్షీణించి పోతుందన్న ప్రచారాన్ని సైతం ఈ ప్రపంచ కప్ తుత్తునీయలు చేసింది. కేవలం క్రికెట్‌లో గెలుపుగా ఎవరూ చూడలేదు దీన్ని. దేశం గర్వపడే సందర్భంగా పరిగణించారు. ఆ భావనతోనే మువ్వన్నెల జెండాలు భుజాన పెట్టుకొని వీధులలో విహరించారు. ఆ రెండు రాత్రులూ జాతీయ పతాకం ప్రతి వూరులో రెపరెపలాడింది. జాతీయ భావన ప్రతి గుండెలో సవ్వడి చేసింది.

ఎప్పుడో 1983లో కపిల్‌దేవ్ భారతదేశానికి ప్రపంచ కప్ తెచ్చి పెట్టాడు. ఆ తర్వాత దాన్ని స్వంతం చేసుకోవడానికి భారత జట్టు 28ఏళ్ల సుదీర్ఘ కాలం ఎదురు చూడవలసి వచ్చింది. ఈ మధ్యలో మన జట్టు నైపుణ్యం లేనిదని కానీ, మన ఆటగాళ్లు సక్రమంగా ఆడలేదని కానీ చెప్పలేము. ఆస్ట్రేలియా, శ్రీలంక వంటి దేశాలు తమ జట్లను మనకంటే మిన్నగా తీర్చి దిద్దడమే ఈ నిరీక్షణకు కారణం. కపిల్‌దేవ్ తర్వాత, భారత ప్రజానీకానికి గెలుపు దాహం తీర్చిన విజేతగా మహేంద్ర సింగ్ ధోనీ చాలాకాలం చరిత్రలో నిలిచిపోతాడు. పాకిస్తాన్‌తో జరిగిన సెమీ ఫైనల్స్ పోటీలో, ఆ తర్వాత శ్రీలంకతో జరిగిన ఫైనల్స్ పోరులో ధోనీ కనపరచిన నాయకత్వ నైపుణ్యమే మన జట్టును విజయపథంలో నడిపించిందనడం నిజం. క్రికెట్ ఆట కూడా ఒక యుద్ధం వంటిదే. ప్రత్యర్థుల బలాన్ని, బలహీనతలను, పరిస్థితులను ఎప్పటి కప్పుడు అంచనా వేసుకొంటూ, అందుకు తగిన వ్యూహాలను రచిస్తూ, ఎప్పుడు ఏ సైనికుడిని యుద్ధరంగంలో ముందు నిలపాలో నిర్ణయిస్తూ, మెలకువతో మెలిగితే తప్ప విజయం స్వంతం కాదు. ధోనీలో ఆ వ్యూహచతురత బాగా ప్రస్ఫుటమైంది.

ఈ సందర్భంలో ప్రత్యేకంగా ప్రస్తావించుకోవలసిన క్రీడాకారుడు సచిన్ టెండూల్కర్. ఆయన క్రీడా నైపుణ్యం దేముడిచ్చిన వరం. సచిన్ వంటి ఆటగాడు మనవాడైనందుకు భారతదేశం కొన్ని దశాబ్దాలపాటు గర్వపడుతూనే వుంటుంది.

నూరు కోట్ల మంది భారతీయుల మనసులలో సంతోషాన్ని నింపిన భారత జట్టును మనసారా అభినందిస్తున్నాము.

జమీన్‌రైతు

# జనవాణి

## జనం నెత్తిన బూడిద

ఒకటి కాదు, రెండు కాదు; జిల్లాలో ఏకంగా 25 థర్మల్ విద్యుత్ కేంద్రాల నిర్మాణానికి అనుమతి మంజూరు చేయడం దారుణం. అది ఒక్క మండలంలోనే రికార్డు స్థాయిలో 17 ప్రైవేట్ రంగ ఫ్యాక్టరీలు. ఖర్మకాలి ఇవన్నీ కడితే పర్యావరణానికి, ప్రజారోగ్యానికి తిలోదకాలే. జనావాసాలకు మరణ శాసనమే. జిల్లాలో భారీ సంఖ్యలో తిష్టవేయనున్న పరిశ్రమలను గూర్చి వింటుంటే కేంద్రం ప్రవేశపెట్టిన సరళీకృత సంస్కరణల విధానం కేవలం దేశ అభివృద్ధి రేటు పెరగడానికేనా, ఇవి ప్రజా సంక్షేమానికి అక్కరకు రావా అనే సంశయం సామాన్యుని మదిని తొలుస్తున్నది. పబ్లిక్ రంగసంస్థలలో సరైన పర్యావరణ, పునరావాస ప్రక్రియలు చేపట్టడం లేదన్న విమర్శలున్నాయి. ఇక లాభాపేక్షే ధ్యేయంగా పనిచేసే ప్రైవేటు రంగ పరిశ్రమలు విడుదల చేసే కాలుష్యాల నుండి ప్రజలను కాపాడే దిక్కెవరు? ఈ విషయంలో ప్రజలను చైతన్యం చేసే విషయంలో ఇప్పటివరకు నేతలు విఫలమయ్యారు. దివంగత నాయకులు సుందరయ్య, వెన్నెలకంటి, ఏ.సి, జమీన్‌రైతు వెంకట్రామా నాయుడు ప్రభృతుల సమరశీల సామాజిక స్పృహను గుర్తుకు తెచ్చుకొని జిల్లా వాసులు ఏకోన్ముఖంగా జిల్లాకు పొంచి వున్న మారణహోమాన్ని నివారించే బృహత్ ప్రయత్నంలో పాలుపంచుకోవాలి. పుట్ల కొద్దీ ధాన్య రాశులు పండే 25వేల ఎకరాల మాగణంలో బూడిద రాశులు పోగుపడి జనజీవన ప్రవంతిని స్తంభింపజేస్తే జిల్లాకే కాదు అది స్వర్ణాంధ్రకే అరిష్టం.

ఎం.రామమూర్తి — విశాఖపట్నం

## ఎమ్మెల్యేల జీతాల పెంపు అనైతికం!

రాష్ట్రంలో సాధారణ ప్రజానీకం పలు సమస్యలను ఎదుర్కొంటున్నారు. ప్రజల సమస్యలను పరిష్కరిస్తామని శాసనసభకు ఎన్నికైన ప్రజాప్రతినిధులు తమ నిజస్వరూపాన్ని వెల్లడించుకొన్నారు. స్వంత లాభం కొంతమాను కోవాల్సిన ఎమ్మెల్యేలు జీతాలు, భత్యాలు, మెడికల్ సౌకర్యాలకుగాను గతంలో ఇస్తున్న మొత్తాలను విపరీతంగా పెంచుకొన్నారు. జీతాలు పెంచడం అన్యాయమని చెప్పే ఒక్క ఎమ్మెల్యే అసెంబ్లీలో లేకపోవడం బాధాకరం. నోట్లు, బ్రాందీ సీసాలతో ఓట్లుకొనే నేతలు నీతినిజాయితీగా ఎందుకు వ్యవహరిస్తారు.

పి.శ్రీరాములు — కావలి

## పోస్టల్ శాఖ నిర్లక్ష్యం!

నానాటికి పోస్టల్ శాఖ నిర్వీర్యమైపోతున్నది. టపాలా బట్వాడా హీనమైపోయింది. నాకు ఇంకా జాబులు వ్రాసే అలవాటుంది. గంగపట్నం, దగదర్తి, తిరుపతిలలోని ఆప్తులకు జాబులు వ్రాస్తుంటే చేరడం లేదు. మనియార్డర్ల

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

11-4-1941
పేజీలు : 12 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు
### మల్లప్ప కాల్వ కథ

మల్లప్ప కాల్వ బాధ చూస్తే వైతరణి రుచి తెలుస్తుంది. కాల్వ ఎండిందంటే ఆ దోమలనే గండ భేరుండ పక్షుల బాధ ఏమి చెప్పను? ఒక్కొక్క దోమ యొక్క ఆ విశాల రెక్కల మీద మాజీ దేశభక్తులు దేశిరెడ్డి శేషరెడ్డి గారి వంటి మహాశయులు కొలువుదీరి విశ్రమించవచ్చు.

అందుకని రెండేళ్లుగా అప్పుడప్పుడు చెర్వు నీళ్లు వదిలితే పది రోజులు ఆ బాధ ఉపశమించడం కద్దు. కొత్త కమిషనరు గారు ఈ మా దోమల విజ్ఞాపనను పాలించి వెంటనే ఈ బాధ తొలగించాలి.

### రామచంద్రారెడ్డి గారి సెనేట్ సభ్యత్వం

బెజవాడ రామచంద్రారెడ్డి గారు రిజిష్టరు గ్రాడ్యుయేట్సు తరపున అధిక సంఖ్యాకులకు ఆంధ్ర సెనేట్‌కు ఎన్నుకోబడ్డారు. వ్యక్తులుగా తీసుకొన్నప్పుడు రెడ్డి గారిది బ్యాడ్ సెలక్షన్ కాదు. వైస్ ఛాన్సలర్ పదవి వీరిని వరించే యెడల కాంగ్రెస్ మాతృ దేవత ఏమంటుందో?

### సత్యాగ్రహ వార్తలు

నెల్లూరు జిల్లాలో ఇప్పటికి సత్యాగ్రహం చేసిన వారు 112గురు. మార్చి 1వ తేది నుండి ఈనాటి వరకు 33గురు సత్యాగ్రహం చేశారు. మార్చి 27 నుండి నేటివరకు 14గురు సత్యాగ్రహం చేయగా, ఆర్గురు అరెస్టయినారు. మిగతా 8లో ఇద్దరు రిమాండులో వున్నారు; ఆర్గురు ఢిల్లీ యాత్రికులైనారు. శిక్షలు 2 నుండి 8 మాసాల వరకు, 100 మొదలు 250 రూపాయల వరకు జుల్మానాలు విధించబడినవి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

7-4-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### గోపాలరెడ్డి గారి శాఖల మార్పు

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారి మంత్రిత్వ హోదా మారలేదు గానీ, శాఖలు మాత్రం మారినవి. ప్రస్తుతం వారు నిర్వహిస్తున్న రెవిన్యూ పౌర వ్యయ శాఖలకు బదులుగా, కె.సి.రెడ్డి గారి వర్క్సు గృహ నిర్మాణ సప్లయి శాఖలు ఇవ్వబడినవి. ఇవి బహుశా గోపాలరెడ్డి గారికి ఏ మాత్రం అభిరుచి, ఆసక్తిలేని శాఖలుగా వుంటవి.

లాల్‌బహదూర్ శాస్త్రి గారు హోంశాఖ మాత్యులుగా నియమితులైనారు. వారి వాణిజ్య పరిశ్రమల శాఖ కె.సి.రెడ్డి గారికి బదలీ చేయబడింది. ప్రస్తుతానికి జరిగిన మార్పులివి. ఇక ముందు ఏమి జరుగుతవో తెలియదు.

క్యాబినెట్ హోదా శాఖల ప్రాధాన్యతను బట్టి గాదు, వ్యక్తులననుసరించి అనేది ఈ మార్పుల వల్ల తేలుతున్నది.

### ఇండ్ల పన్నుల హెచ్చింపు

నెల్లూరు పట్టణంలో ఎక్కడకెళ్లినా, ఎవరి నోట విన్నా పన్నుల పెంపకం విషయం గురించే వినబడుతున్నది. చిన్న పెద్ద తారతమ్యం లేకుండా పన్నుల పెంపకాన్ని విమర్శిస్తున్నారు. పన్నుల హెచ్చింపుకు బాధ్యులైన త్రిమూర్తులు – ముగ్గురు వాల్యుయేషన్ ఆఫీసర్లు నెల్లూరు నగరంలో నూతన చైతన్యాన్ని కల్గించారు. నెల్లూరు నగరంలో పూర్వం హిందూ ముస్లిమ్ కలహాలనంతరం, ఇలాంటి తీవ్ర సంచలనం ఎప్పుడూ కలిగియుండలేదంటే అతిశయోక్తి కాదేమో!

# నెల్లూరు ముచ్చట్లు

**విలేఖరుడు**

## మహీధర్ రాకతో మట్టిపోశారు!

ముఖ్యమంత్రి, ఇతర ముఖ్యులెవరైనా వస్తేగానీ నెల్లూరులో దెబ్బతిన్న రోడ్లపై కాసింత మట్టిపోసేవారు కనిపించడం లేదు. 6వ తేది నెల్లూరుకు మునిసిపల్ మంత్రి మానుగుంట మహీధర్‌రెడ్డి రావడంతో నగరంలో దెబ్బతిన్న రోడ్లపై బూడిద సిమెంటు పోసి కార్పొరేషన్ అధికారులు పైపై మెరుగులు దిద్దారు.

## చేపల మార్కెట్‌కు సందాని బాష పేరు!

నెల్లూరు డైకస్‌రోడ్డులో ఆధునీకరించిన చేపల మార్కెట్‌కు మునిసిపల్ మంత్రి మానుగుంట మహీధర్‌రెడ్డి 6వ తేది రిబ్బన్ కత్తిరించారు. వివేకానంద రెడ్డి పాత మార్కెట్‌లో కొన్ని కట్టడాలు చేయించి కాస్త రంగులువేసి ఇది అంతర్జాతీయ స్థాయి చేపల మార్కెట్ అంటున్నాడు. కానీ అక్కడ గబ్బు మాత్రం పాత తరహాలోనే వుంది. ఈ మార్కెట్‌లో కొత్తదనమేదైనా వుందంటే దీనికి మునిసిపల్ మాజీ వైస్ ఛైర్మన్ సయ్యద్ సందాని బాష పేరు పెట్టడం. సందాని మైనారిటీలకు చేసిన సేవకు ఆయన నిరంతరం సంచరించిన ప్రాంతంలోనే స్మృతి చిహ్నం ఏర్పాటు చేయడం చూసి 'భాయ్' సంతోషిస్తాడనుకొంటాం.

## సై అంటున్న మేకపాటి బ్రదర్స్!

తమను తరచూ రాజీనామా చేయమంటున్న ఆనం బ్రదర్స్ సవాల్‌కు మేకపాటి బ్రదర్స్ స్పందించారు. వైఎస్ జగన్మోహన్‌రెడ్డితో వుంటూ కాంగ్రెస్ పార్టీలో పదవుల్లో కొనసాగటం పొరపాటే. ఆనం బ్రదర్స్ మాపై చేస్తున్న విమర్శలకు సమాధానం చెప్పనే మా పదవులకు రాజీనామాచేసి మళ్లీ ఎన్నికల్లో గెలిచి తమ సత్తా చూపిస్తామంటున్నాడు ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి. కడప ఉప ఎన్నికలు ముగిశాక మేకపాటి బ్రదర్స్ తమ పదవులకు రాజీనామా చేస్తారని వారి సన్నిహితులు చెబుతున్నారు.

## వరుస చోరీలు

నెల్లూరు నగరంలో వరుస చోరీలు జనాన్ని బెంబేలెత్తిస్తున్నాయి. ఎసి సెంటర్‌లో కారు నిలుపుకొని విత్తనాలు కొనను వెళ్లిన వ్యక్తి కారు అద్దాలు పగులగొట్టి మూడు లక్షల 70వేల రూపాయలు పట్టుకెళ్లిన దొంగలు అదే రోజు ఐసిఐసిఐ బ్యాంకు వద్ద కాపుకాసి బ్రహ్మాస్ ఇంజనీరింగ్ కాలేజి ఉద్యోగి ఐతా కృష్ణచైతన్యను దోచుకొన్నారు. రంగనాయకులపేటలో ఓ మహిళ గొంతుకోసి బంగారు సరుడు పట్టుకెళ్లడంతోపాటు సండే మార్కెట్‌లో కారు పార్కింగ్ చేసి అందులో బ్యాగ్ పెట్టి వెళ్లిన గూడూరు మునిసిపల్ మాజీ ఛైర్మన్ యారం మంజుల బంగారు వస్తువులు దోచుకొన్నారు. ఆరో తేది నెల్లూరు సబ్ రిజిస్ట్రార్ కార్యాలయంలో స్థలానికి సంబంధించిన రిజిస్ట్రేషన్ పూర్తి చేయను 20లక్షలతో వచ్చిన సురేంద్రబాబు తన మారుతీ కారును బృందావనంలోని కార్పొరేషన్ బ్యాంకు వద్ద నిలిపివుంచి టైర్ మార్చుకొంటుండగా ఆయన్ను ఏమార్చి కారులోని 20లక్షలు పట్టుకెళ్లిపోయారు. బ్యాంకుల దగ్గర కాపు కాయడం, ఒంటరిగా వున్న మహిళలను దోచుకోవడం ధోరణిలో సాగిపోతున్న ఈ దొంగల ముఠా పనిపట్టాల్సిన అవసరం పోలీసులకు లేదా?

## ఎమ్మెల్సీల ప్రమాణం

శాసన మండలికి తూర్పు రాయలసీమ పట్టభద్రులు, ఉపాధ్యాయ నియోజకవర్గం నుంచి ఎమ్మెల్సీలుగా ఎన్నికైన యండపల్లి శ్రీనివాసులురెడ్డి, విఠపు బాలసుబ్రహ్మణ్యంల చేత ప్రొటెం స్పీకర్ బసవపున్నయ్య మార్చి 31వ తేది ప్రమాణ స్వీకారం చేయించారు. స్థానిక సంస్థల స్థానం నుంచి గెలిచిన వాకాటి నారాయణరెడ్డి ఇంకా ప్రమాణ స్వీకారం చేయాల్సివుంది.

## మండుతున్న ఎండలు

ఏప్రెల్ నెల మొదటి వారంలో ఎండలు మండిపోతుండడంతో నగర ప్రజలు విలవిల్లాడుతున్నారు. రోజురోజుకు ఉష్ణోగ్రతలు తీవ్రతరం అవుతుండడంతో చిన్నారులు, వృద్ధులు వేడిమికి తట్టుకోలేక పోతున్నారు. దీనికి తోడు కరెంటు కోత వేధిస్తుండడంతో ఉక్కపోతకు ప్రజలు ఉక్కిరి బిక్కిరై పోతున్నారు. మే నెలలో ఇంకెంత తారాస్థాయికి ఉష్ణోగ్రతలు చేరుకొంటాయోనని భీతిల్లుతున్నారు.



## వ్యాపారుల దబాయింపు!

పాలిథిన్ కవర్ల వాడకంపై నగరంలో నిషేధం విధించిన సంగతి తెలిసిందే. 40 మైక్రాన్ల కన్నా తక్కువ సామర్థ్యం కలిగిన కవర్లను మాత్రమే నిషేధించామని, 40 మైక్రాన్లు పైన వుండే కవర్లను వినియోగించవచ్చని అధికారులు చెప్తున్నా ఇదే అదునుగా భావించిన అంగళ్లవాళ్లు కవర్లు ఇవ్వడం మానేశారు. ఈ కవర్లు కొంచెం ఖరీదుతో కూడుకున్నవి కావడంతో ఏకమొత్తంగా ప్లాస్టిక్ కవర్లు నిషేధించారని వ్యాపారులు వినియోగదారులను దబాయిస్తున్నారు.

## రంగు నీళ్లు

అసలే వేసవి తీవ్రత కారణంగా మంచినీటి సమస్యను ఎదుర్కొంటున్నారు నగరవాసులు. చాలా ప్రాంతాల్లో ఇప్పటికే కొళాయినీళ్లు ఒక పూట వస్తే మరొక పూట రావడం లేదు. ఈ పరిస్థితులలో అరకొరగా వచ్చే మంచినీరు సైతం రంగుమారి మురికిగా వస్తుండడంతో ప్రజలు వాటిని పట్టుకోలేక, త్రాగునీటికి తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. రంగుమారిన నీళ్లు గత కొంతకాలంగా వస్తున్నా మునిసిపల్ అధికారులు పట్టించుకోకపోవడంతో ప్రజలకు ఇబ్బందులు తప్పడం లేదు.

## అందరూ పెద్దోళ్లేనా?

పద్యనాటక కళాపరిషత్ ఆధ్వర్యంలో కస్తూరిబా కళాక్షేత్రంలో యోగి వేమన, శ్రీనాథుడు పద్యనాటకాల ప్రదర్శన రెండు రోజులపాటు జరిగింది. ఆంధ్రజ్యోతి ఎండి రాధాకృష్ణ విచ్చేసి ఈ నాటకాలను ప్రారంభించారు. వీటిని తిలకించేందుకు అందరూ వయసుపైబడిన వారే వచ్చి వున్నారని గమనించిన ఆయన 30, 35 మధ్య వయసు గల వారు వెతికినా కన్పడడం లేదని వ్యాఖ్యానించారు.

## కూల్‌డ్రింక్స్ హానికరం

శీతల పానీయాలను త్రాగడం వల్ల కలిగే అనర్థాలపై జనవిజ్ఞాన వేదిక నగరంలో ప్రచారం చేపట్టింది. వేసవి తాపం నుంచి బయటపడేందుకు కూల్‌డ్రింక్స్ అధికంగా త్రాగుతుంటారని అయితే వాటి వలన జీర్ణకోశ సమస్యలు తలెత్తుతాయని వేదిక నాయకులు వివరించారు. ఈ సందర్భంగా కూల్‌డ్రింక్స్‌తో టాయిలెట్లు శుభ్రపరిచి చూపించారు. కూల్‌డ్రింక్స్‌కు బదులు మజ్జిగ, టెంకాయ నీళ్లు త్రాగడం మంచిదని తెలిపారు.

## బల్లి దుర్గాప్రసాద్ ఆవేదన

తూర్పు కనుపూరు గ్రామంలోని ముత్యాలమ్మ దేవస్థానంలో జరిగిన ఉత్సవాల సందర్భంగా తనను గర్భగుడిలోనికి రానివ్వక పోవడం పట్ల గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ ఆవేదన వ్యక్తం చేశారు. 5వ తేది నెల్లూరు కస్తూరిబా కళాక్షేత్రంలో జరిగిన బాబు జగజ్జీవన్ రామ్ జయంతి సభలో ఎమ్మెల్యే మాట్లాడుతూ దళితుడిని కావడం వల్లే ధర్మకర్తల మండలి ఈవిధంగా అవమానించారని చెప్పడంతో ఈ విషయమై తక్షణ నివేదిక తెప్పించి చర్యలు తీసుకొంటానని కలెక్టర్ రాంగోపాల్ హామీ ఇవ్వడంతో ఎమ్మెల్యే శాంతించారు.

## యువతి శవం

నెల్లూరు ఎన్టీఆర్ నగర్‌లోని వేణుగోపాలస్వామి కాలేజి ప్రాంగణంలో గుర్తు తెలియని 20 ఏళ్ల యువతి శవాన్ని 5వ తేది స్థానికులు గుర్తించి పోలీసులకు సమాచారమందించారు. ఈ యువతిపై అత్యాచారం చేసి చంపి వుంటారన్న అనుమానాన్ని పోలీసులు వ్యక్తం చేస్తున్నారు. ఈ యువతి సూళ్లూరుపేట మండలం ఇలుపూరు గ్రామానికి చెందిన తాడిపత్రి పద్మావతిగా గుర్తిం చారు. సంఘటనా స్థలాన్ని నగర

కొరవ 14వ పేజీలో

## నేను అందరివాడ్ని...

● బదలీ లేదని తేల్చి చెప్పిన ఎస్పీ!



నెల్లూరు ఎస్పీలుగా మహా మహులు పనిచేశారు. ఇప్పటివరకు పనిచేసిన వారందరిలో పెద్ద మాటల మాంత్రికుడు మాత్రం ఇప్పటి ఎస్పీ ఈతముక్కల దామోదర్ అని చెప్పక తప్పదు. ఏ విషయంపైన అయినా ఆయన కాసింత చమత్కారం, హాస్య చతురత, 22 ఏళ్ల సర్వీసు అనుభవం జోడించి మాట్లాడుతారు. ఉగాది పండుగను పురస్కరించుకొని తనను కలసిన విలేకరులతో బంగ్లాలో ఉల్లాసంగా ఉత్సాహంగా మాట్లాడారు. నేను నెల్లూరుకు వచ్చి ఏడాది అయ్యింది. వచ్చినప్పుడు ఎవరో నన్ను ఇక్కడకు మార్పించారన్నారు. ఇప్పుడేమో బదలీ అంటున్నారు. మా అమ్మాయికి పెళ్లి కుదిరిందంటున్నారు. వీటిలో ఏ విషయమూ వాస్తవం కాదు. ఇప్పుడు నేను అందరివాడ్ని. నా బదలీని ఎవరూ కోరుకోవడం లేదన్నారు. ఎస్పీగా నేను నాలుగు బాధ్యతలు నెరవేర్చాలి. శాంతి భద్రతలు కాపాడాలి. అవి జిల్లాలో బేషుగ్గా వున్నాయి. సిబ్బంది బాగానే పనిచేస్తున్నారు. అన్ని దొంగతనాలను అరికట్టడానికి నా దగ్గర మంత్రదండమేదీ లేదు. ట్రాఫిక్ సమస్య సరిదిద్దలేకపోతున్నామంటున్నారు. నెల్లూరులో ట్రాఫిక్ సమస్యను పోలీసులే సరిదిద్దలేరని దీనికి కార్పొరేషన్, ఆర్ అండ్ బి శాఖలు, ప్రజలు కూడా కలసి రావాల్సి వుందన్నారు. నిరంతరం ప్రజలకు అందుబాటులో వున్నానని, ఎస్సీ, ఎస్టీ కేసులపై ఇష్టమొచ్చినట్లు ఫిర్యాదులందుతున్నా కూలంకషంగా విచారించాకే కేసులు నమోదు చేస్తున్నట్లు ఎస్పీ ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. జిల్లా ప్రజలు ఖర నామ సంవత్సరంలో సుఖ సంతోషాలతో వర్ధిల్లాలని ఎస్పీ ఆకాంక్షించారు.

# నెల్లూరులో ఘనంగా ఉగాది!

దేవాలయాలు, పంచాంగ శ్రవణాలకు జనం

నెల్లూరు నగరంలో ఖర నామ సంవత్సర ఉగాది వేడుకలను ప్రజలు ఘనంగా చేసుకొన్నారు. జనవరి 1వ తేది అంత జల్సాగా కాకపోయినా కాస్త లేటుగా జనం తల స్నానాలు చేసి కొత్త బట్టలు ధరించి దర్గామిట్టలోని రాజరాజేశ్వరమ్మ, మాగుంట లేఅవుట్‌లోని వెంకటేశ్వరస్వామి, టౌన్‌హాల్ వద్ద వినాయకుడు, నగరంలోని అన్ని సాయిబాబా మందిరాల వద్ద జనం బారులు తీరి కన్పించారు. కస్తూరిబా కళాక్షేత్రంలో ప్రభుత్వం తరపున జరిగిన ఉగాది వేడుకలకు జిల్లా కలెక్టర్ రాంగోపాల్ నేతృత్వం వహించారు. తెలుగుతల్లి విగ్రహానికి కలెక్టర్ పూలమాల వేసి కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఎం.డి.వెంకట్రాజు బృందం నాదస్వర కచ్చేరి అనంతరం పూర్ణానందశాస్త్రి ఉగాది పంచాంగ శ్రవణం చేశారు. అనంతరం 12 మంది కవుల నేతృత్వంలో కవి సమ్మేళనం జరిగింది. గురుకృపా నృత్య కళాశాల విద్యార్థులు ప్రదర్శించిన శాస్త్రీయ సంగీతం, శాస్త్రీయ నృత్యాలు సభికులను రంజింప జేశాయి. కార్యక్రమానికి తరలి వచ్చిన వారికి ఉగాది పచ్చడి, పులిహోర, పాయసం అందించి తెలుగు సాంప్రదాయ ప్రాముఖ్యతను చాటి చెప్పారు.

టిటిడి నేతృత్వంలో రామ్మూర్తినగర్‌లోని బాలపీరయ్య కళ్యాణ మండపంలో ఉగాదిని పురస్కరించుకొని ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన శ్రీవారి ఉదయాస్త మాన సేవలను చూసి జనం పులకించి పోయారు.



కస్తూరిబా కళాక్షేత్రంలో జరిగిన ఉగాది వేడుకల్లో జ్యోతి ప్రజ్వలన చేస్తున్న జిల్లా కలెక్టర్ రాంగోపాల్.

ఈ కార్యక్రమానికి పెద్ద సంఖ్యలో జనం హాజరయ్యారు. బాలాజీ నగర్‌లో స్వామి విద్యారణ్య భారతి చేసిన ధార్మికోపన్యాసం అందరినీ అలరింపజేసింది. ఉగాదిని పురస్కరించుకొని వర్ధమాన సమాజం టౌన్‌హాల్‌లో ఏర్పాటుచేసిన ప్రత్యేక కార్యక్రమంలో స్వయంపాకుల శ్రీనివాసులు పంచాంగ శ్రవణం చేశారు.

## 29 లక్షలు దాటిన జిల్లా జనాభా

పురుషులే ఎక్కువ

జిల్లా జనాభా 29,66,082కు చేరుకొంది. ఇటీవల జరిపిన జన గణనలో ఈ వివరాలు వెల్లడయ్యాయి. జనాభా పరంగా చూస్తే రాష్ట్రంలో జిల్లా 17వ స్థానంలో నిలచింది. 2001 జనాభా లెక్కల ప్రకారం మొత్తం జనాభా 26,68,564. వీరిలో పురుషులు 13,44,935 మంది, స్త్రీలు 13,23,629 మొత్తం కుటుంబాలు 6,40,942. దశాబ్ద కాలం తర్వాత ఈ ఏడాది ఫిబ్రవరి నెలలో చేపట్టిన జనగణనలో ఈ సంఖ్య 11.15 శాతం పెరిగింది. 2,97,518 మంది పెరిగినట్లు గణాంకాలు వెల్లడిస్తున్నాయి. కుటుంబాల పరంగా పరిశీలించినట్లైతే 1,30,584 కుటుంబాలు పెరిగాయి. 2001న జనాభా లెక్కలు, 2011లో జరిగిన జనగణనను చూస్తే పెరిగిన కుటుంబాల సంఖ్య 7,71,526గా తెలుస్తుంది. పురుషులు, స్త్రీల సంఖ్యను పరిశీలిస్తే పురుషులు 14,93,254, మహిళలు 14,72,828 మంది. వీరిద్దరు కాకుండా హిజ్రాల సంఖ్య 54గా నమోదైంది. పిల్లల సంఖ్యను చూస్తే జిల్లాలో మొత్తం 2,87,368 మంది వున్నారు. బాలురు 1,47,719, బాలికలు 1,79,649.



నెల్లూరు నారీమణులను అధిగమించిన పురుషులు.

అక్షరాస్యత శాతాన్ని గమనిస్తే 69.15 శాతంగా నమోదైంది. పదేళ్ల క్రిందట 2001 సంవత్సరంలో నిర్వహించిన జనాభా లెక్కల్లో అక్షరాస్యత శాతం 65.08గా వుండగా 2011కు స్వల్పంగా 4.07 శాతం మేర పెరిగిందని చెప్పాలి.

## బియ్యం ఎగుమతికి అనుమతివ్వాలి!

రాష్ట్రంలో బియ్యం ఎగుమతులకు తక్షణం అనుమతులివ్వాలని బిజెపి సీనియర్ నేత ఎం.వెంకయ్యనాయుడు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. ఏప్రెల్ 1న తన స్వగృహంలో ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడారు. రాష్ట్రంలో రైతుల పరిస్థితి దయనీయంగా వుందన్నారు. ప్రకృతి ప్రకోపాలతో తల్లడిల్లుతున్న రైతాంగం ప్రభుత్వ తీరు వల్ల మరింతగా నష్టపోతుందన్నారు. బియ్యం ఎగుమతులకు అనుమతి లేకపోవడం వల్ల రాష్ట్రంలో ధాన్యం నిల్వలు భారీగా పెరిగాయన్నారు. ఈ పరిస్థితి వల్ల 2009, 2010వ సంవత్సరంలో పండిన ధాన్యం సైతం రైతుల వద్దే పేరుక పోయాయన్నారు. దాదాపు 1.20 కోట్ల టన్నుల ధాన్యం రైతుల వద్ద వుందన్నారు. ఈ ధాన్యాన్ని భద్రపరచుకొనేందుకు వసతి లేకపోవడంతో రైతులు ఏదో ఒక ధరకు తెగ నమ్ముతున్నారని ఆవేదన చెందారు. రైతుల స్థితిని అవకాశంగా చేసుకొని వ్యాపారులు తగ్గించి కొంటుండడంతో రైతులు తీవ్రంగా నష్టపోతున్నారని తెలిపారు. గత ఏడాది ఈ నెల్లో పుట్టి 13 వేల రూపాయల ధర పలుకగా, ప్రస్తుతం 6,800 మాత్రమే ధర వుందన్నారు. ఓ వైపు పెట్టుబడులు పెరుగుతుంటే, మరోవైపు ధాన్యం ధరలు మాత్రం తగ్గిపోతున్నాయని ఆందోళన వ్యక్తం చేశారు. తక్షణం ప్రభుత్వం జోక్యం చేసుకొని 60 లక్షల టన్నుల ధాన్యాన్ని ఎగుమతి చేసుకొందుకు అనుమతివ్వాలని, మరో 35 లక్షల టన్నులను ఎఫ్‌సిఐ ద్వారా కొనుగోలు చేసివ్వాలని ఆయన చెప్పారు. అదేవిధంగా ఇప్పుడున్న రైతుల రుణాల రీషెడ్యూల్‌ను సక్రమంగా అమలు చేయడం లేదన్నారు. రీషెడ్యూల్ సమయంలో వడ్డీ మాఫీ రీషెడ్యూల్ చేయాల్సి వుండగా అది అమలు కావడం లేదన్నారు. చివరకు పొగాకు రైతులకూ అన్యాయం జరుగుతున్నదన్నారు. త్వరలో ఐదు రాష్ట్రాల్లో జరుగనున్న ఎన్నికలపై మాట్లాడుతూ ఆయా రాష్ట్రాల్లో అధికార పార్టీలు ఓడిపోవడం ఖాయమన్నారు. తమిళనాడు, కేరళ, అస్సాం రాష్ట్రాల్లో బిజెపి బలమైన శక్తిగా ఎదుగుతుందన్నారు. ఈ సమావేశంలో బిజెపి జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి తదితరులు పాల్గొన్నారు.



వెంకయ్య డిమాండ్.

● నెల్లూరుతో

## ఆత్మీయానుబంధం

తెలుగు చలన చిత్రసీమలో కొత్త వారిని ప్రోత్సహించిన దర్శకులు ఆదుర్తి సుబ్బారావు, దాసరి నారాయణరావులేనని సీనియర్ నటుడు చంద్రమోహన్ స్పష్టం చేశారు. నెల్లూరుకు వచ్చిన ఆయన సింహపురితో తనకుగల అనుబంధాన్ని, చిత్రసీమలో తన ప్రవేశాన్ని వివరించారు. అప్పుడు ఎన్టీఆర్, ఎఎన్ఆర్‌ల కాలం. వాళ్లే అన్ని చిత్రాలు చేసేవాళ్లు. కొత్త వారికి అవకాశం కల్పించే వారు కాదు. అలాంటి రోజుల్లో ఆదుర్తి సుబ్బారావు, దాసరి నారాయణరావు లాంటి వాళ్లు నన్ను, కృష్ణలాంటి వారిని ఎంతగానో ప్రోత్సహించారు. అప్పటి నుంచి కొత్త తరానికి అవకాశాలు లభించాయి. నా తొలి హీరోయిన్ నెల్లూరమ్మాయి



మనసులో మాట చెప్పిన నటుడు చంద్రమోహన్.

వాణిశ్రీ కావడం విశేషం. సింహపురి గడ్డకు పలుమార్లు విచ్చేసే అవకాశం లభించింది. చిన్నారి స్నేహం తదితర చిత్రాల షూటింగ్‌కు నెల్లూరుకు విచ్చేశాను. నెల్లూరీయులు ఎందరో సినీ రంగంలో పేరు ప్రఖ్యాతులు గడించారు. హాస్యనటుడు రమణారెడ్డి, నాగభూషణం, రాజనాల, గాన గంధర్వుడిగా పేరుగాంచిన బాలసుబ్రహ్మణ్యం, మరెందరో దర్శకులు, రచయితలు నెల్లూరు వారేనని వారందరితో తనకు ఎంతో సాన్నిహిత్యం వుందన్నారు. చిత్ర రంగానికి విచ్చేసి 45 ఏళ్ల అయింది, ఇప్పటివరకు 760 సినిమాల్లో నటించాను. భగవంతుడు అవకాశం ఇచ్చినన్నినాళ్లు నటిస్తూనే వుంటాను. టివి రంగం వైపు మాత్రం వెళ్లను. ఇక నా జీవితంలో విలువైన సలహాలిచ్చిన వాళ్లు ఇద్దరు. ఆర్థికంగా ఎలా నిలదొక్కుకోవాలి, ఎలా పొదుపు చేసుకోవాలో నేర్పింది శోభన్‌బాబు గారైతే, ఆరోగ్యాన్ని ఎలా కాపాడుకోవాలి, మితంగా తినడం వల్ల ఎంతటి మేలని చెప్పింది అక్కినేని నాగేశ్వరరావు. ఇప్పుడు చిత్రసీమలో వారసుల యుగం. నాకైతే ఇద్దరూ ఆడ పిల్లలు. నా భార్య జలంధర రచయిత్రి. నా సినిమాలు, కుటుంబంతో హాయిగా గడిపేస్తున్నాను.

# ప్రజాగ్రహమనే పిల్లి మెడకు గంట కట్టిన అన్నా హజారే!

16వ పేజీ కొరవ

మంత్రులు కాగానే కోట్లకు పడగలెత్తుతున్నారు. వారిననుసరించి అధికార యంత్రాంగం ఖజానాకు కన్నాలు పెడుతున్నది. ఈ విషవలయం ప్రభావం వల్ల ప్రజల సంక్షేమం కోసం వెచ్చించవలసిన లక్షల కోట్ల రూపాయల ప్రజాధనం కొందరి బొజ్జలు నింపడానికి మాత్రమే వృథా అయిపోతున్నది. పంచవర్ష ప్రణాళికలు ఎన్ని గడిచినా పేదవాడి జీవితం మాత్రం మెరుగు పడడం లేదు. ఈ దురన్యాయాన్ని సరిదిద్దాలంటే, రాజకీయ పదవులలో వుండేవారిని సైతం తప్పు చేస్తే కఠినంగా శిక్షించే వ్యవస్థ వుండాలన్నది అన్నా హజారే వంటి సామాజిక సేవకుల వాంఛ.

## మన్మోహనుడు మొసలి కన్నీరు

వ్యక్తిగా మన ప్రధాని మన్మోహన్ సింగ్ స్వచ్ఛమైన వాడనే పేరుంది. నిజాయితీకి, నిరాడంబరతకు, నిష్కల్మషత్వానికి ఆయన ఒక సంకేతమనే ప్రచారం వుంది. అటువంటి సచ్ఛీలుడు ప్రధానిగా వున్నప్పుడు, ఇటువంటి రాజకీయ చెదలు నిర్మూలన చట్టాలు రూపుదిద్దుకోవడంలో అడ్డంకులు, అభ్యంతరాలు వుండవనే జనం నమ్ముతున్నారు. కానీ దురదృష్టవశాత్తు మన్మోహన్‌సింగ్ కూడా ఈ విషయంలో మొసలి కన్నీరు నాటకాలు ఆడుతున్నాడే తప్ప, చిత్తశుద్ధితో వ్యవహారం చేయడం లేదు. ఏదో చేశామన్పించుకోవడానికి మాత్రమే తన పూర్వీకుల వలె ఒక చచ్చు పుచ్చు లోక్‌పాల్ బిల్లు తయారు చేయించాడు. ఆయన రూపొందించిన బిల్లు ప్రకారం లోక్‌పాల్ వ్యవస్థ ఏర్పడితే, కోరలు లేని పాము వంటి దిష్టి బొమ్మ మాత్రమే ప్రజలకు మిగులుతుంది. ఏ అవినీతి నిర్మూలన, వున్నత స్థానాలలో వుండే వారిలో బాధ్యతాయుత ప్రవర్తన ఆశించి లోక్‌పాల్ వ్యవస్థ నెలకొల్పుతున్నారో, ఆ లక్ష్యం నెరవేరే అవకాశం లేశ మాత్రం కూడా మిగలదు. అందువల్లనే అన్నా హజారే సత్యాగ్రహ దీక్ష సంకల్పించాడు.

## ప్రజాగ్రహమనే పిల్లి మెడకు గంట కట్టిన అన్నా హజారే

2జి స్పెక్ట్రం కుంభకోణంలో రెండు లక్షల కోట్ల లూటీ, కామన్‌వెల్త్ గేమ్స్ గోల్మాల్‌లో వేల కోట్ల రూపాయల స్వాహా, అవినీతికేసు వున్నవాడికి చీఫ్ విజిలెన్స్ కమిషనర్‌గా నియామకం, సాక్షాత్తు ప్రధాని పర్యవేక్షణలోని ఇస్రో స్పెక్ట్రం కేటాయింపులో రెండు లక్షల కోట్ల రూపాయలు దిగమింగడానికి ప్రయత్వం.... ఇట్లా చెప్పుకొంటూ పోతే గత రెండేళ్లలో కేంద్ర ప్రభుత్వ స్థాయిలో అవినీతి విష వృక్షం వెయ్యి వూడలతో వికట నాట్యం చేస్తున్నది. ఈ కుంభకోణాలు కప్పి పెట్టడానికి ప్రభుత్వ పెద్దలు చేసిన దుష్ప్రయత్నాలు, సుప్రీంకోర్టు మొట్టికాయ తర్వాత కానీ కదలిక లేని దుర్మార్గ పాలన ప్రజలలో తీవ్ర ఆగ్రహం పెల్లుబికేట్లు చేస్తున్నది. రాజకీయ వ్యవస్థ మీదనే విశ్వాసం కోల్పోయారు ప్రజలు. ఈ నిరామయ వాతావరణంలో అన్నా హజారే అవినీతి నిర్మూలనకు నడుము బిగించడం, దేశ ప్రజలందరినీ ఆనందంలో ముంచెత్తుతున్నది. తమ ఆగ్రహానికి ఒక ఉద్యమ రూపం కల్పించే పెద్ద దిక్కు దొరికిందన్న ఉద్వేగంతో కోట్లాది మంది సాధారణ ప్రజలు అన్నా హజారేకు అండగా నిలబడుతున్నారు.

## ఆక్రోష్ సినిమా నమూనా

హజారే నిరాహార దీక్ష ప్రారంభించిన రెండవ రోజుకే దేశమంతా దాని ప్రకంపనలు కనిపించాయి. ఎక్కడికక్కడ ప్రజలే స్వచ్ఛందంగా వీధులలోకి వచ్చి హజారే కోరిక తీర్చాలని ఆందోళన చేపడుతున్నారు. ట్విట్టర్, ఫేస్ బుక్ వంటి సోషల్ నెట్ వర్కింగ్ వెబ్ సైట్లలో లక్షలాది సందేశాలు ప్రవహిస్తున్నాయి. పత్రికా కార్యాలయాలకు కోట్లాది ఈ మెయిల్‌లు వస్తున్నాయి. దాదాపు పది వేల మంది ఢిల్లీ వాసులు తమంతట తాముగా గేట్ వే ఆఫ్ ఇండియా వద్దకు వెళ్లి, కొవ్వొత్తులు వెలిగించి, హజారేకు మద్దతు ప్రకటించారు. ఆ సన్నివేశం చూస్తే ఇటీవలే వచ్చిన ఆక్రోష్ సినిమా జ్ఞాపకానికి వచ్చింది. ఆ సినిమా కథలో వలనే ప్రజలలో ఈ అంశం మీద విపరీతమైన స్పందన వెల్లువెత్తుతున్నది. కాశ్మీర్ నుంచి కన్యాకుమారి వరకు జనంలో కన్పిస్తున్న కదలిక చూసిన ప్రభుత్వ పెద్దలకు

కొరవ 14వ పేజీలో

### ప్రభుత్వ బిల్లు రూపం

1. లోక్‌పాల్ విచారణ పరిధి ప్రధానమంత్రి, కేంద్ర మంత్రులు, పార్లమెంట్ సభ్యులకు మాత్రమే పరిమితం.
2. ప్రజలు తమ ఫిర్యాదులను లోక్‌సభ స్పీకర్ లేదా రాజ్యసభ అధ్యక్షులకు మాత్రమే పంపాలి. లోక్‌పాల్‌కు స్వతంత్రంగా ఫిర్యాదులు స్వీకరించే అధికారం లేదు.
3. లోక్‌పాల్‌కు పోలీసు అధికారాలు వుండవు. అందువల్ల ఎఫ్ఐఆర్ నమోదు చేసుకోలేదు.
4. ప్రధానమంత్రిపై వచ్చే ఫిర్యాదులు దేశ రక్షణ, విదేశీ వ్యవహారాలు, సైన్యానికి సంబంధించినవైతే, లోక్‌పాల్ విచారణ చేయకూడదు.
5. లోక్‌పాల్ పాత్ర సలహాదారువలె వుంటుంది. తన సిఫార్సులను, ప్రధానమంత్రి, పార్లమెంట్ సభ్యులకు చెందినవైతే లోక్‌సభ స్పీకర్‌కు, కేంద్రమంత్రులకు సంబంధించినవైతే ప్రధానికి పంపాలి. వాటిపై చర్య వారి ఇష్టం.
6. అవినీతితో సంపాదించిన సొత్తును స్వాధీనం చేసుకొనే అధికారం లోక్‌పాల్‌కు లేదు.
7. లోక్‌పాల్ విచారణ ఆరునెలల నుంచి సంవత్సరం లోపల పూర్తి చేయాలి. కానీ ఆ తర్వాత కోర్టులలో నడిచే అప్పీల్ విచారణకు కాల పరిమితి లేదు.
8. లోక్‌పాల్‌లో రిటైర్డ్ న్యాయమూర్తులు ముగ్గురు సభ్యులుగా వుంటారు.
9. ఆ సభ్యులను ఎంపిక చేసే అధికారం ప్రభుత్వంలోని పెద్దలది.

### అన్నా అడిగే బిల్లు స్వరూపం

1. లోక్‌పాల్‌కు రాజకీయవాదులు, అధికారులు, న్యాయమూర్తులందరి మీద విచారణ అధికారం వుండాలి.
2. ప్రజలు నేరుగా ఫిర్యాదులు పంపుకొనే స్వాతంత్ర్యం వుండాలి.
3. లోక్‌పాల్‌లో సెంట్రల్ విజిలెన్స్ కమిషన్, సిబిఐలోని అవినీతి నిరోధక శాఖలను విలీనం చేయాలి. దానివల్ల లోక్‌పాల్ నేరుగా ఫిర్యాదు స్వీకరించి, ఎఫ్ఐఆర్ నమోదు చేసుకొని, అవసరమైతే నిందితులను అరెస్ట్ చేసే అధికారం కూడా కలిగి వుండాలి.
4. లోక్‌పాల్ విచారణకు ఏ అంశం మీదా నిషేధం వుండకూడదు. రక్షణ వ్యవహారాలపై కూడా విచారణ జరపవచ్చు.
5. లోక్‌పాల్ పాత్ర సలహాలకు పరిమితం కాదు. విచారణ తర్వాత అవినీతిపరులను ప్రాసిక్యూట్ చేయడం, క్రమశిక్షణా చర్యలు తీసుకోవడం చేయవచ్చు.
6. అవినీతి నిర్ధారణ అయినవారి ఆస్తులను స్వాధీనం చేసుకొని, ప్రభుత్వ పరం చేయడంతోపాటు, వారి అవినీతి వల్ల జరిగిన నష్టాన్ని పూర్తిగా రాబట్టే అధికారం వుండాలి.
7. లోక్‌పాల్ విచారణ ఒక సంవత్సరం లోపల పూర్తి కావాలి. ఆ తర్వాత అప్పీల్ కేసులు కూడా ఒక సంవత్సరం లోపల ముగియాలి.
8. లోక్‌పాల్‌లో కనీసం 10 మంది సభ్యులుండాలి. వీరిలో నలుగురు న్యాయ నిపుణులతోపాటు పౌర సమాజం నుంచి సభ్యులుండాలి. న్యాయమూర్తులుగా పని చేసి వుండాలనే నియమం వుండకూడదు.
9. లోక్‌పాల్ సభ్యులను ఎంపిక చేసే కమిటీలో చీఫ్ ఎలక్షన్ కమిషనర్, ఆడిటర్ అండ్ కంప్ట్రోలర్ జనరల్, చీఫ్ విజిలెన్స్ కమిషనర్, రిటైర్డ్ ఆర్మీ జనరల్స్, న్యాయమూర్తులు వుండాలి.

## ఎవరీ అన్నా హజారే?

మహారాష్ట్రలోని అహ్మద్‌నగర్ జిల్లాలో రాలేగాం సిద్ది అనే మారు మూల గ్రామానికి చెందిన నిరుపేద వ్యవసాయ కూలీ కుటుంబానికి చెందినవాడు అన్నా హజారే. కరవు కాటకాల వల్ల పూట గడవక తన అత్త ఇంటికి దత్తు వెళ్లాడు. ఆమె కూడా పోషించలేక పోవడంతో 7వ తరగతితో చదువు మాని, బొంబాయి నగర వీధులలో పూలు అమ్మి బ్రతికాడు. తర్వాత సైన్యంలో ట్రక్ డ్రైవర్ ఉద్యోగం వచ్చింది. 1965 యుద్ధంలో రక్తపాతం చూసి చలించిపోయి, మానవ జీవితం వ్యర్థమనే విరక్తితో ఆత్మహత్యా ప్రయత్నం చేశాడు. కానీ బ్రతికాడు. సైన్యంలో వుండగానే స్వామి వివేకానందుడి ఉపన్యాసాలను చదివి ఉత్తేజితుడై, సమాజ సేవకు అంకితం కావాలనే లక్ష్యంతో సైన్యాన్ని వదలి తన స్వగ్రామం వచ్చాడు. అప్పటి ఆ వూళ్లో కరవు జనం నికృష్ట జీవితాలు గడుపుతున్నారు. ఆ పరిస్థితులను సంస్కరించే ఉద్దేశంతో తక్కువ నీటితో వ్యవసాయం చేసే ప్రయోగాలకు శ్రీకారం చుట్టాడు. గ్రామస్తుల చేతనే శ్రమదానం ద్వారా వర్షపు నీటిని నిల్వ చేసుకొనే వసతులు నిర్మింపచేశాడు. వాటిలో ఆయన సాధించిన విజయం ఆ గ్రామాన్ని మెట్ట ప్రాంతంలో డెల్టా మాగాణులకంటే అధికంగా సస్యశ్యామలం చేసింది. తన గ్రామస్తులందరి చేతా మద్యం మాన్పించడం, పశువులకు సరైన పోషణ, చెట్లు నరకకుండా నివారించడం, కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు మగవారు మాత్రమే చేసుకొనే అలవాటు వంటి మార్పులు తెచ్చాడు. దానితో ఆయన పేరు ప్రపంచమంతా మార్మోగింది.

అక్కడ నుంచి ఆయన కార్యక్షేత్రం మొత్తం మహారాష్ట్రకు విస్తరించింది. కొన్ని వందల గ్రామాలు రాలేగాం సిద్ధిని అనుసరించాయి. పౌరులకు సమాచార హక్కు వుండాలనే నినాదంతో, 1997లో బొంబాయి అజాద్ మైదానంలో మొదటిసారిగా ఆందోళన జరిపాడు హజారే. అదే నినాదంతో 2003లో నిరాహార దీక్ష చేశాడు. కేంద్ర ప్రభుత్వం దిగి వచ్చి రైట్ టు ఇన్ఫర్మేషన్ యాక్ట్ తయారు చేసింది. అవినీతిపరులైన మంత్రుల పై చర్య తీసుకోవాలనే ఆందోళనతో 2003 ఆగష్టులో, ఆ తర్వాత మరొకసారి ఆయన జరిపిన నిరాహార దీక్షల ఫలితంగా మహారాష్ట్ర ప్రభుత్వంలోని ఆరుగురు మంత్రులు తమ పదవులు వదులుకోవాల్సి వచ్చింది. మహారాష్ట్ర సహకార బ్యాంకుల్లో అవినీతిపై హజారే చేసిన ఆందోళన వల్ల విస్తృత స్థాయి విచారణ జరిగి దాదాపు ఆరు వందల కోట్ల రూపాయల సొమ్ము తిరిగి రాబట్టింది ప్రభుత్వం.

అన్నా హజారే అసలు పేరు బాబూరావ్ హజారే. ఆయన్ను అందరూ ప్రేమగా అన్నా అని పిలవడంతో ఈ పేరు స్థిరపడింది. ఆయనకు పెళ్లి కాలేదు. తన గ్రామంలోని దేవాలయానికి ఆనుకొని వుండే ఒక చిన్నగదిలో నివాసం. ఇద్దరు అక్కలున్నారు కానీ వారి ఇళ్లకు గత నలభై ఏళ్లలో ఎప్పుడూ వెళ్లలేదు. తనకు కుటుంబ అనుబంధాలు వుండకూడదని, తన జీవితం పూర్తిగా సమాజానికే అంకితమని హజారే భావన. నిరాహార దీక్ష వల్ల చనిపోతాననే భయం నాకు లేదు. చావు తప్పదనుకొన్నప్పుడు, అది దేశం కోసంగా వుండాలన్నది నా కోరిక అంటాడు హజారే. నేను చస్తే ఏడ్చే కుటుంబ సభ్యుడు ఎవడూ లేడని కూడా గర్వంగా చెప్పుకొంటాడాయన.

# వెంకటగిరిలో ఆక్రమణల పర్వం!

## ప్రభుత్వ స్థలాలు ఆక్రమిస్తున్నా చూస్తూ ఊరుకొంటున్నారు.

వెంకటగిరి పట్టణంలో ప్రభుత్వ స్థలాల ఆక్రమణ అధికమయ్యింది. ఎవరూ అడిగేవారు లేరన్న ధైర్యంతో కబ్జాదారులు స్థలాలు ఆక్రమించి ఏకంగా నిర్మాణాలు చేపడుతున్నారు. మునిసిపల్ పాలకవర్గం రద్దయ్యి ప్రత్యేకాధికారుల పాలన వచ్చిన తర్వాత ఇవి మరింతగా పెరిగిపోయాయి. పలుమార్లు దీనిపై అధికారుల దృష్టికి తీసుకెళ్లినా పట్టించుకోవడం లేదని ప్రజలు వాపోతున్నారు. క్రాస్ రోడ్డు నుంచి రైల్వే స్టేషన్ రోడ్డు ప్రక్కనే వున్న రెండో నెంబర్ సాంఘిక సంక్షేమ వసతి గృహాలకు చెందిన స్థలం ఆక్రమించేశారు. అక్కడ ఏకంగా షాపింగ్ కాంప్లెక్స్ నిర్మిస్తున్నారు. ఒక మహిళ పేరుతో పట్టా సృష్టించి ఈ నిర్మాణం చేపట్టడం విశేషం. ఉపాధ్యాయనగర్ వద్ద బాలికల హాస్టల్ స్థలం, వ్యవసాయశాఖ సహాయ సంచాలకుల ఆఫీసు స్థలం ఆక్రమణలకు గురైంది. ఇక్కడే నిర్మాణాలు జరుగుతున్నాయి. ప్రభుత్వ స్థలంలో ప్రహరీ నిర్మాణం జరుగుతోంది. ఈ ఆక్రమణలపై సంబంధితశాఖల అధికారులు పోలీసులకు ఫిర్యాదు ఇచ్చినా ఫలితం లేకుండా పోయింది. ప్రభుత్వ స్థలాలను ఆక్రమించి నిర్మాణాలు చేపడుతున్న కబ్జాదారులకు మునిసిపాలిటీ ఎలా అనుమతిస్తుందో తెలియడం లేదు. ఈ ఆక్రమణలపై సమగ్ర విచారణ జరిపి కబ్జాదారులపై చర్యలు తీసుకోకపోతే భవిష్యత్‌లో వెంకటగిరిలో ప్రభుత్వ స్థలాలే కప్పించకుండాపోయే ప్రమాదం వుందని పట్టణ ప్రజలు ఆందోళన చెందుతున్నారు.





ఎమ్మెల్సీగా ఎన్నికైన వాకాటి నారాయణరెడ్డిని అభినందిస్తున్న పిసిసి కార్యదర్శి ఉడతా వెంకట్రావు. బిసి సెల్ కన్వీనర్ రఘురామ్, సాయిరాం తదితరులు.

## రైల్వేస్టేషన్‌లో కోతుల దండు

### బిట్రగుంటలో భయం... భయం

బిట్రగుంట రైల్వేస్టేషన్‌లో కోతుల బెడద అధికంగా వుంది. నిత్యం వందలాది మంది రాకపోకలు సాగించే రైల్వేస్టేషన్‌లో వానర దండు చేస్తున్న అలజడి ప్రయాణీకులను భయభ్రాంతులకు గురి చేస్తోంది. మనుషులపైన పడి దాడులు చేయడంతోపాటు చేతిలో వున్న వస్తువులను లాక్కొని పోతుండడంతో ప్రయాణీకులు హడలిపోతున్నారు. ఈ వానరసేన ధాటికి స్టేషన్‌కు రావాలంటేనే భయపడాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి. బ్రిడ్జిపైన అధికంగా వుండే కోతులు ఒక్కసారిగా మీదకు వస్తుండడంతో రైలెక్కాలనే హడావిడిలో వున్నవారు కిందపడి గాయాలపాలవుతున్నారు. నిత్యం కావలి, నెల్లూరు తదితర ప్రాంతాలకు కూలీ పనులు నిమిత్తం వెళ్లే వారి టిఫిన్ బాక్స్‌లను కోతులు పడదోస్తుండడంతో ఆహారం నేలపాలై వారు పడుతున్న వేదన అంతా ఇంతా కాదు. స్టేషన్‌లో కోతుల బెడదను నివారించాలని పలుమార్లు రైల్వే అధికారులను కోరినా ఫలితం లేకుండాపోయిందని ప్రయాణీకులు వాపోతున్నారు.

## బీద అనుచరుల్లో నిస్పృహలు

ఎమ్మెల్సీ ఎన్నికల్లో పోటీ చేసి ఓటమిపాలైన తెలుగు యువత రాష్ట్ర అధ్యక్షుడు బీద రవిచంద్ర అనుచరుల్లో తీవ్ర నిరాసక్తత వ్యక్తమవుతోంది. గతంలో జిల్లా పరిషత్ ఛైర్మన్ ఎన్నికల్లో ఒకసారి ఇలాగే ఓటమి పాలైనాడు. తిరిగి ఇప్పుడు స్థానిక సంస్థల ఎన్నికల్లో మరోసారి రవిచంద్ర అపజయాన్ని మూటగట్టుకోవడాన్ని తెలుగుదేశం పార్టీ కార్యకర్తలు, బీద అనుచరులు జీర్ణించుకోలేకపోతున్నారు. బోగోలు మండలంలో ఈ ఓటమిపై తీవ్రస్థాయిలో చర్చజరుగుతోంది. టిడిపి సభ్యులపై వున్న నమ్మకంతో శిబిరాలు నిర్వహించకపోవడం, వీరిలో కొందరు మిగతా అభ్యర్థుల దగ్గర డబ్బులు తీసుకొని క్రాస్ ఓటింగ్‌కు పాల్పడడంతో ఈ పరిస్థితి ఏర్పడిందని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు. అందరు పార్టీ విధానాలకు కట్టుబడి రవిచంద్రకే ఓటు చేశామని చెప్తున్నా ఎవరు వెన్నుపోట్లకు పాల్పడ్డారో, ఎవరు నమ్మకంగా ఓటు చేశారో అంతుచిక్కని రహస్యమైంది. గతంలోనూ మండలంలో బలనిరూపణ జరిగిన సందర్భంలో ముగ్గురు టిడిపి ఎంపీటీసి సభ్యులు ఒక్కొక్కరు 30వేల రూపాయలు తీసుకొని కాంగ్రెస్‌కు అమ్ముడుపోయారు. చివరలో ఆలస్యంగా విషయం గ్రహించిన బీద సోదరులు దీనిని నియంత్రించగలిగారు. అప్పుడే ఇలాంటి వారిపై క్రమశిక్షణా చర్యలు తీసుకొని వుంటే ఎమ్మెల్సీ ఎన్నికల్లో ఇలాంటి చేదు అనుభవం ఎదురై వుండేది కాదని మండలంలో వాఖ్యానిస్తున్నారు.

## పల్లిపాడులో భూ పోరాటం!

బాలాయపల్లి మండలం పల్లిపాడు గ్రామంలో పేదలు భూపోరాటం చేపట్టారు. కొన్ని సంవత్సరాలుగా భూములను పంపిణీ చేయమని అధికారులను కోరుతున్నా పట్టించుకోలేదని, భూస్వాములకు కొమ్ముకాస్తున్నారంటూ అధికారుల తీరుపై ధ్వజమెత్తారు. గ్రామంలోగల బంజరు భూమిలోకి ప్రవేశించిన పేదలు చెట్టు పుట్టా కొట్టి భూమికోసం ఉద్యమించారు. వీరికి నాయకత్వం వహించిన సిపిఎం నేత వడ్డిపల్లి చెంగయ్య, వ్యవసాయ కార్మిక సంఘం నేతలు విజయకుమార్, రాజగోపాల్ తదితరులు ప్రభుత్వ తీరుపై విరుచుకపడ్డారు. గ్రామంలో 346 ఎకరాల బంజరు భూమి వుందని, దీనిని భూమిలేని పేదలకు పంచిపెట్టాలని పలుమార్లు అధికారులను కోరామని, ధర్నాలు, ఆందోళన చేపట్టామన్నారు. అయినా అధికారుల్లో చలనం లేదని విమర్శించారు. భూస్వాములకు వందల ఎకరాలు ఇచ్చిన రెవెన్యూ అధికారులు అర్హులైన పేదలకు భూములను పంపిణీ చేయడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుండడంతో భూపోరాటానికి దిగాల్సివచ్చిందన్నారు.

# పోస్టల్ శాఖ పాట్లు!

● ముత్తుకూరు మండలంలో పోస్టాఫీసులన్నీ అద్దె ఇళ్లలోనే...

ముత్తుకూరు మండలంలో గ్రామీణ తపాలాశాఖ కార్యాలయాలకు సొంత భవనాలు లేకపోవడంతో ప్రజలకు సరైన సేవలు అందడం లేదు. మండలంలోని పలు ప్రాంతాల్లో ఇదే పరిస్థితి. సొంత భవనాలు లేక ఇతరత్రా ఏర్పాటు చేసుకొని పోస్టాఫీసులను నిర్వహించాల్సి వస్తుండడంతో తపాలా సేవల్లో లోపం ఏర్పడుతోంది. పిడతాపోలూరు గ్రామంలో పోస్టాఫీసును పంచాయితీ కార్యాలయంలోనే ఒక గదిలో నిర్వహించాల్సి వస్తుండడంతో అటు సిబ్బంది, ఇటు ప్రజలకు ఇబ్బందులు తప్పడం లేదు. మండలంలో మొత్తం 12 బ్రాంచి పోస్టాఫీసులు ఈ సమస్యనే ఎదుర్కొంటుండడంతో తపాలా సేవలు ప్రజలకు సక్రమంగా అందని పరిస్థితి నెలకొనింది. ఈ సమస్యను దృష్టిలో వుంచుకొని ఉన్నతాధికారులు తగిన చర్యలు చేపట్టాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.

## మన్మధరావుకు అవార్డు

వెంకటగిరి మండలం జికెపల్లి ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో సహాయ పారా మెడికల్ అధికారిగా పనిచేస్తున్న మన్మధరావు అవార్డు నందుకొన్నారు. క్షయవ్యాధి నివారణకుగాను తన దైన కృషి చేసినందుకు జిల్లా క్షయ నివారణశాఖాధికారులు ఆయన్ను ఈ అవార్డుకు ఎంపిక చేశారు.

### క్షయవ్యాధి నివారణకు విశేష కృషి

నెల్లూరు మెడికల్ అసోసియేషన్ హాలులో జరిగిన ఒక కార్యక్రమంలో మార్చి 24తేదీ మన్మధరావును అధికారులు సన్మానించి జ్ఞాపికను అందజేశారు. ఈ కార్యక్రమంలో జిల్లా క్షయవ్యాధి నివారణాధికారి సురేష్ బాబు, జిల్లా వైద్యాధికారి వెంకటరమణారెడ్డి, కుష్టు వ్యాధి నిర్మాలన కేంద్రం అధికారిణి పద్మావతి పలు స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు హాజరయ్యారు.



నెల్లూరులోని హరివిల్లు క్రియేషన్స్‌వారి ఉగాది పురస్కారాన్ని పౌరాణిక నటుడు పొన్నాల రామసుబ్బారెడ్డికి అందిస్తున్న అమరావతి కృష్ణారెడ్డి. ప్రక్కన హజరత్‌బాబు, బి.వి.నరసింహం, కిషోర్‌దాస్, సుధాకర్‌రాజు, విజయకుమార్‌రెడ్డి, అంజాద్‌బాబు, దోర్నాల హరిబాబు.



నెల్లూరు మూలపేటలోని అరుంధతిపాలెంలో బాబు జగజ్జీవన్‌రామ్ జయంతిని పురస్కరించుకొని ఆయన చిత్ర పటానికి పూలమాలవేసి నివాళులర్పిస్తున్న వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నాయకుడు మందా బాబ్జీ, గోపాలరావు, వెంకయ్య, మణి, రమణయ్య.

# ధాన్యం కొనుగోలు కేంద్రాలలో గిట్టుబాటు ధర!

రైతులకు గిట్టుబాటు ధర కల్పించాలన్న ఉద్దేశ్యంతోనే కొనుగోలు కేంద్రాలను ఏర్పాటు చేయడం జరిగిందని, దీనిని దృష్టిలో వుంచుకొని ఈ కేంద్రాలను ప్రోత్సహించాల్సిన అవసరం ఎంతైనా వుందని జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్

### జాయింట్ కలెక్టర్ వెల్లడి

తెలిపారు. తోటపల్లి గూడూరు మండలం సాలిపేటలో ఏర్పాటు చేసిన ధాన్యం కొనుగోలు కేంద్రాన్ని ఆయన సందర్శించి రైతులతో మాట్లాడారు. గోతాల సమస్య, తరకలు, పచ్చగింజ, వడ్లు ఆరబెట్టుకోవడం తదితర సమస్యలను రైతులు జెసి దృష్టికి తీసుకొని వచ్చారు. సాధ్యమైనంత వరకు కొన్ని నిబంధనలను ప్రక్కన బెట్టి ధాన్యాన్ని కొనుగోలు చేయాలని వ్యవసాయశాఖ జెడి నరసప్పకు సూచించారు. శాంపిల్స్ తీసుకరావడం, పోవడంలో తలెత్తుతున్న ఇబ్బందులపై జెసి స్పందిస్తూ ఆదర్శరైతుల ద్వారా శాంపిల్స్ తెప్పించుకొనేలా చర్యలు తీసుకోవాలన్నారు. ఇందుకూరుపేట, తోటపల్లిగూడూరు, సౌత్‌మోపూరులోని కేంద్రాల నుంచి ధాన్యం కొనుగోళ్లను అధికంగా చేపట్టాలని అధికారులను ఆదేశించారు. వ్యవసాయశాఖ ఎడి రవిచంద్రప్రసాద్, ఎపిఎం కృష్ణవేణి, డిఎం ప్రభాకర్, తహశీల్దార్ లక్ష్మీనారాయణ శ్యామ్‌కుమార్ తదితరులు పాల్గొన్నారు.

# గూడూరు సబ్ జైలుకు వీడియో లింకేజి!

**న్యాయమూర్తి సత్యప్రభాకర్‌రావు వెల్లడి**

గూడూరు సబ్‌జైలుకు వీడియో లింకేజి సౌకర్యం కల్పించనున్నట్లు సివిల్ జడ్జి, న్యాయసేవాధికార సంస్థ కార్యదర్శి జి.సత్యప్రభాకర్‌రావు తెలిపారు. గూడూరు సబ్ జైలును తనిఖీ చేసిన ఆయన మాట్లాడుతూ ఈ విధానాన్ని నెల్లూరు జిల్లా జైలులో అమలుపరచామన్నారు. వీడియో లింకేజి వల్ల కోట, వెంకటగిరి, సూళ్లూరుపేట కోర్టులకు చెందిన రిమాండ్ ఖైదీలను విచారించేందుకు అవకాశం కల్గుతుందన్నారు. కేసులు సత్వరం పరిష్కారం కావడంతోపాటు ఎస్కార్ట్ ఖర్చులు తగ్గుతాయన్నారు. అలాగే ఖైదీలు పరారయ్యే సంఘటనలు తలెత్తకుండా వుంటాయన్నారు. న్యాయసేవాధికార సంస్థ ఆధ్వర్యంలో శిక్ష అనుభవిస్తున్న వారి వివరాలు సేకరించి వారి కేసులకు ఉచితంగా న్యాయవాదులను నియమిస్తామన్నారు. ఈ సందర్భంగా ఆయన జైలులోని గదులను, ఖైదీల వసతి, భోజన పదార్థాలను పరిశీలించారు. జడ్జితోపాటు జైలు సూపరింటెండెంట్ బాలకృష్ణారెడ్డి, డిప్యూటి సూపరింటెండెంట్ రమేష్ తదితరులు పాల్గొన్నారు.

# రూ.420 కోట్ల రుణాల పంపిణీ

**ఆంధ్రప్రగతి గ్రామీణ బ్యాంక్ ప్రణాళిక ఇది**

ఆంధ్ర ప్రగతి గ్రామీణ బ్యాంకు పరిధిలోగల ఐదు జిల్లాలలో ఈ ఆర్థిక సంవత్సరంలో 420 కోట్ల రూపాయల రుణాలను పంపిణీ చేసినట్లు జనరల్ మేనేజర్ కులకర్ణి తెలిపారు. కోట గ్రామంలో నూతనంగా నిర్మించిన బ్రాంచ్‌ను ఆయన ప్రారంభించారు. జిల్లాలో ఇది 68వ బ్రాంచ్ అన్నారు. నెల్లూరు, ప్రకాశం, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలో 382 బ్యాంకులు లాభాల బాటలో వున్నాయన్నారు. విద్యతోపాటు, రైతులు, పొదుపు సంఘాలకు ప్రాధాన్యమిచ్చామన్నారు. ఇతర వాణిజ్య బ్యాంకులకు తీసిపోని విధంగా తమ బ్యాంకు ఖాతాదారులకు సేవలందిస్తున్నట్లు కులకర్ణి చెప్పారు. ఈ సందర్భంగా ఆయన ఆంధ్రప్రగతి గ్రామీణ బ్యాంకుల పనితీరు తదితర అంశాలను కూలంకషంగా వివరించారు. బ్యాంకు రీజినల్ మేనేజర్ శేషగిరిరావు మాట్లాడుతూ దీర్ఘకాలిక పంట రుణాలను లక్ష్యానికి మించి అందించినట్లు తెలిపారు.

## దిలీప్‌పై ఎందుకంత ప్రేమ




రాష్ట్ర సమాచార కమిషన్ మాజీ సభ్యుడు, పాత్రికేయుడు దిలీప్‌రెడ్డిపై సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి చెప్పలేని ప్రేమను ఒలకబోస్తుండటం అధికార వర్గాల్లో విమర్శకు గురవుతోంది. దిలీప్‌రెడ్డిని రాష్ట్ర పరిపాలన ట్రిబ్యునల్ మెంబర్‌గా నియమించాలంటూ సిఎం ప్రతిపాదించాడు. అయితే దిలీప్‌కు ఎటువంటి పాలనానుభవం లేనందున ట్రిబ్యునల్ మెంబర్‌గా నియమించలేనంటూ గవర్నర్ ఫైల్‌ను తిప్పి పంపారు. అయితే సిఎం మాత్రం పట్టు వదలకుండా దిలీప్ పేరును మళ్లీ ప్రతిపాదించాడు. దీంతో గవర్నర్ నరసింహన్ తీవ్ర అసంతృప్తికి గురయ్యారట. ఎంత చెప్పినా వినకపోతే ఎలా అంటూ అధికారుల ముందు చిర్రుబుర్రులాడారట. చివరకు తగాదా ఎందుకనుకున్నాడో ఏమోగానీ కేంద్రప్రభుత్వం అంగీకరిస్తే నియమించుకోండి అంటూ ఫైలుపై రాశారట. సిఎం వైఖరిపై సచివాలయంలో తీవ్ర చర్చ జరుగుతోంది. ఏదైతేనేం దిలీప్ నక్కతోక తొక్కివుంటాడు.




## ఐఎఎస్‌ల బదలీలు ఇప్పట్లో లేవా?




శాసనసభ సమావేశాలు ముగిసిన వెంటనే రాష్ట్రంలో భారీ ఎత్తున ఐఎఎస్‌ల బదిలీలు చేపట్టడానికి ముఖ్యమంత్రి కిరణ్ రంగం సిద్ధం చేశారు. అయితే ఇతర రాష్ట్రాల ఎన్నికల నిర్వహణకు దాదాపు నలభైమంది ఐఎఎస్‌లను మనరాష్ట్రం నుంచి ఎంపిక చేయడంతో బదలీలు ఇప్పట్లో జరిగే అవకాశం లేదు. పెద్ద సంఖ్యలో ఐఎఎస్‌లు ఎన్నికల విధుల్లో వుండగా బదలీలు చేసే సాంప్రదాయం లేదు. అందుకే ఐఎఎస్‌లు తిరిగివచ్చే దాకా వేచి వుండాలని కిరణ్ నిర్ణయించారు. దీంతో మే నెలాఖరుదాకా ఐఎఎస్‌ల బదలీలు జరిగేట్లు లేవు. అయితే కొందరు మంత్రులకు తమ శాఖల ఐఎఎస్‌లు కొరకరానివారిగా తయారయ్యారు. దీనిపై వారిని మార్చాలంటూ సదరు మంత్రులు సిఎంపై ఒత్తిడి తెస్తున్నారు. ఈ ఒత్తిడి బదలీలకు కూడా తాత్కాలికంగా తెరపడినట్లేనని సచివాలయ వర్గాలు అంటున్నాయి.

## డిఎల్ సారథ్యంలో ఉప ఎన్నికలు



కడపజిల్లాలో జరుగనున్న పులివెందుల అసెంబ్లీ, కడప పార్లమెంటు స్థానాల ఉప ఎన్నికల బాధ్యతను రాష్ట్ర మంత్రి డిఎల్ రవీంద్రరెడ్డిపై పెట్టారు. కడప జిల్లాలో వై.ఎస్ వర్గాన్ని తీవ్రంగా వ్యతిరేకించే డిఎల్ అయితేనే ఎన్నికల సమరాన్ని సమర్థంగా నడప గలరని కాంగ్రెస్ పార్టీ భావిస్తోంది. ఇటీవల జరిగిన స్థానిక సంస్థల ఎమ్మెల్సీ ఎన్నికల్లో డిఎల్ సారథ్యం బెడిసి కొట్టిన దానిపై పార్టీలో తీవ్ర చర్చ జరిగింది. అయినా డిఎల్ నాయకత్వంపట్ల ముఖ్యమంత్రి కిరణ్ మొగ్గు చూపారు. జిల్లాలో సీనియర్ అయిన డిఎల్ అయితేనే పార్టీ వర్గాల్ని ఏకతాటిపై నడిపించగలడని సిఎం నమ్మకంగా వున్నాడు. దీంతో ఉప ఎన్నికల భారాన్ని డిఎల్‌కు అప్పగించటానికి పార్టీ పెద్దలంతా నిర్ణయించారు. ఎన్నికల బరిలో ఎవరిని నిల బెట్టాలన్న దానిపై కూడా డిఎల్ అభిప్రాయాన్నే పరిగణలోకి తీసుకున్నారట. చూద్దాం... డిఎల్ ఏ మేరకు విజయం సాధిస్తాడో!!

## ఉప ఎన్నికలపైనే జగన్ ఎమ్మెల్యేల కన్ను




కడపజిల్లాలో జరుగనున్న ఉప ఎన్నికల ఫలితాలపై అందరికంటే జగన్‌కు మద్దతునిస్తున్న ఎమ్మెల్యేలే ఎక్కువ ఆసక్తి చూపుతున్నారు. స్థానిక సంస్థల ఎమ్మెల్సీ ఎన్నికల్లో అనూహ్యంగా జగన్ పైచేయి సాధించినా ప్రత్యక్షంగా జరుగనున్న ఉప ఎన్నికలే జగన్‌పార్టీ భవిష్యత్తును నిర్ణయిస్తాయన్నది వారి భావన. అందుకే ఉప ఎన్నికల ఫలితాలు వచ్చేవరకు వేచి చూసి ఆ తర్వాతే తమ భవిష్యత్తు గురించి నిర్ణయం తీసుకోవాలని వారు భావిస్తున్నారు. ఉప ఎన్నికలకు ముందే జగన్ పార్టీకి మద్దతుగా తమ పార్టీలకు రాజీనామా చేయాలన్న ప్రతిపాదన వచ్చింది. అయితే ఫలితం ఎలా వుండబోతోందోన్న అనుమానం కారణంగా ఆ ప్రతిపాదనను వాయిదా వేస్తున్నారు. జగన్ గనుక రెండు స్థానాల్లో విజయం సాధిస్తే మాత్రం వెంటనే రాజీనామాలు చేసి వైఎస్ఆర్‌పార్టీకి బహిరంగంగా జైకొట్టడానికి సిద్ధంగా వున్నామని వారు చెబుతున్నారు.




చెన్నైలోని ఆంధ్రా సోషల్ కల్చరల్ అసోసియేషన్ ఆధ్వర్యంలో జరిగిన ఉగాది వేడుకలలో హాస్య వల్లరిని ప్రదర్శించిన దోర్నాల హరిబాబు బృందాన్ని అభినందిస్తున్న హాస్యనటుడు బ్రహ్మానందం, క్లబ్ అధ్యక్షుడు నరసారెడ్డి.

## సమైక్య పంచాంగం వెనుక 'బాబు' హస్తం



ఉగాది సందర్భంగా తెలుగుదేశంపార్టీ కార్యాలయంలో ఏర్పాటు చేసిన పంచాంగ పఠనంలో సమైక్యవాదం వినబడటం వెనుక చంద్రబాబు హస్తం ఉందంటూ తెలంగాణ తమ్ముళ్లు మండిపడుతున్నారు. పంచాగం వినిపించిన పొన్నలూరి శ్రీనివాస గార్గేయ సమైక్య రాష్ట్రమే వర్ధిల్లుతుందని, వచ్చే ఏడాది సమైక్యం గానే పంచాగ శ్రవణం జరుగుతుందని చెప్పారు. దీంతో అక్కడే వున్న తెలంగాణ తమ్ముళ్లు అగ్గిబుగ్గయ్యారు. పంచాంగ పఠనంలో సమైక్య ప్రస్తావన ఎందుకంటూ పెదవి విరిచారు. చంద్రబాబు కావాలనే 'సమైక్య' ప్రస్తావనపై సిద్ధాంతిని పురిగొల్పి వుంటారని కొందరు తెలంగాణ తమ్ముళ్లు చెవులు కొరుక్కొన్నారట. అయితే సిద్ధాంతి భవిష్యవాణి పట్ల దేశం సీనియర్ నాయకుడు దయాకర్‌రావు బహిరంగంగానే విరుచుకుపడ్డారు. పండగపూట ఇటువంటి అప్రస్తుత ప్రసంగం వల్ల తెలంగాణవాదులకు మనస్తాపం కలిగిందంటూ విచారం కూడా వ్యక్తం చేశాడు. వింటున్నారా బాబూ! పంచాంగ పఠనాలు సమస్యకు పరిష్కారం కాజాలవేమో? ఆలోచించండి!



నెల్లూరు ట్రంకురోడ్డులోని వెంకటరమణ విలాస్ నిర్వాహకుడు చక్కా మాల్యాద్రి కుమార్తె రవిజ, పవన్‌కుమార్‌ల వివాహం మార్చి 25తేది పరమేశ్వరి కళ్యాణ మండపంలో జరిగింది.

# ఆదర్శ పురుషుడు శ్రీరాముని జన్మదినమే శ్రీరామనవమి!



దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో ఘనంగా జరుపుకొనే పండుగ శ్రీరామనవమి. ఈ పండుగ పేరు చెప్పగానే చలువ పందిళ్లు, పానకం, సీతారామకళ్యాణం గుర్తుకు వస్తాయి. వసంత రుతువులో వచ్చే ఈ పండుగకు ఎంతో ప్రాధాన్యత వుంది. ధర్మసంస్థాపన కోసం శ్రీ మహావిష్ణువు ఎత్తిన అవతారాల్లో ఏడవ అవతారం శ్రీరామావతారం. త్రేతాయుగంలో జన్మించిన రాముడు ఆదర్శ పురుషుడు. ఏక పత్నీ వ్రతుడు. ఒకే మాట – ఒకే బాణంగా విరాజిల్లిన రఘురాముడు చైత్రశుద్ధ నవమి, పునర్వసు నక్షత్రం కర్నాటక లగ్నం అభిజిత్ ముహర్తంలో మధ్యాహ్నం 12 గంటలకు జన్మించినట్లు రామాయణ కావ్యంలో చెప్పబడుతుంది. అందుకోసమే నవమినాడు శ్రీరామనవమి పండుగను ప్రజలు జరుపుకొంటారు. మధ్యాహ్నం సమయంలో శ్రీరాముడు జన్మించినందున ఆ సమయంలో దేవాలయాల్లో ఉత్సవాలు ప్రారంభం అవుతాయి.

శ్రీరాముడు దేవుడనే విషయం ప్రక్కన పెడితే తండ్రి మాటను జవదాటనివాడిగా, మిత్రుడిగా, సోదరునిగా తన వ్యక్తిత్వంతో ఆదర్శవంతంగా నిలిచాడు. అందుకే రఘుకులతిలకుడిని ఈనాటికి ఆదర్శ పురుషునిగా భావిస్తారు, కొలుస్తారు. రాజ్యపాలన చేపట్టిన ఆయన ప్రజలంతా సుఖసంతోషాలతో విలసిల్లేలా చేసి రామరాజ్యం అంటే ఏమిటో చాటి చెప్పాడు. అందుకే జాతిపిత మహాత్మాగాంధీ నుంచి నేటి వరకు రామరాజ్యం రావాలని కోరుకొంటుంటారు. శ్రీరామనవమికి ఎన్నో విశేషాలున్నాయి. 14ఏళ్లు అరణ్యవాసం తర్వాత సీతా సమేతంగా శ్రీరాముడు అయోధ్యలో అడుగిడి పట్టాభిషక్తుడయ్యింది నవమినాడే. సీతా రామకళ్యాణం జరిగింది కూడా నవమినాడేనని చెప్తారు.

శ్రీరామనవమినాడు పెందలకడే నిద్రలేచి స్నానం చేసి సీతారామలక్ష్మణ సమేత హనుమంతుని పూజించి వడపప్పు, పానకం నైవేద్యంగా పెడతారు. ఆలయాలలో సీతారామకళ్యాణాన్ని వైభవంగా నిర్వహిస్తారు. ఇళ్లలోగాని గుడిలో గాని సీతారాముల కళ్యాణాన్ని జరిపించినా, వీక్షించినా సకల శుభాలు కల్గుతాయని పురాణాలు చెప్తున్నాయి. ఆనాడు పలు గ్రామాల్లో వసంతోత్సవం పేరిట రంగులు చల్లుకోవడం ఆనవాయితి. రాముడి గురించి, మనిషి ఎలా జీవించాలి. ఎలా వుండాలి అని చెప్పే మార్గదర్శక కావ్యం రామాయణం. అన్నమయ్య రామచంద్రుడితడు రఘువీరుడు అన్నా, త్యాగయ్య జగదానందకారక అని పాడినా, రామదాసు అంతా రామ మయం అన్న కీర్తనలు విన్నా మదిభక్తి పారవశ్యంతో పులకిస్తుంది.



## ట్రంకు రోడ్డు కబుర్లు

### అప్రకటిత కర్ఫ్యూ




నెల్లూరు నగరంలో కర్ఫ్యూ పరిస్థితులు అరుదు. కాని ఏప్రెల్ 2తేది క్రికెట్ ప్రపంచ కప్ ఫైనల్ మ్యాచ్‌ను పురస్కరించుకొని నగరంలో అప్రకటిత కర్ఫ్యూ వాతావరణం కనిపించింది. మ్యాచ్ ప్రారంభమైన 2.30 నుంచి మ్యాచ్ ముగిసేవరకు రోడ్లపై జనసంచారమే లేదు. మ్యాచ్ ముగిసి ఇండియా జగజ్జేతగా నిలిచిన తర్వాత జనం ఒక్కసారిగా రోడ్లపైకి వచ్చారు. బాణాసంచా కాల్చడంతోపాటు, స్వీట్లు పంచుకొని సందడి చేశారు.

### వేరుగా 'ఉగాది'




తెలుగు సంవత్సరాది ఉగాది పండుగను నెల్లూరులో ప్రతిఒక్కరూ ఆనందోత్సాహాల మధ్య జరుపుకొన్నారు. అయితే ఈ వేడుకల్లో ఆధిపత్య పోరు చూపాలని పోటీలు పడి నిర్వహించారు. ప్రభుత్వ కార్యక్రమంతోపాటు వివిధ ప్రాంతాల్లో ప్రైవేటు వ్యక్తులు, రాజకీయ పార్టీలకు చెందినవారు పంచాంగ శ్రవణాలు ఏర్పాటు చేశారు. నగరంలో లెక్కకు మించి పెరిగిపోయిన సాంస్కృతిక సంస్థలు నిర్వహించిన కవి సమ్మేళనాల్లో పాల్గొంటూ కవులు హడావుడిగా కనిపించారు. మన సంస్కృతిలో భాగమైన కట్టుబొట్టు గూర్చి కవితల్లో వివరిస్తూ వారు మాత్రం ప్యాంట్, షర్టలతో దర్శనమిచ్చారు.

### తిక్కతిక్కగా విద్యుత్ కోత




మిట్ట మధ్యాహ్నం 12 గంటల నుంచి రెండు గంటల వరకు విధిస్తున్న విద్యుత్ కోతకు నెల్లూరీయులు అల్లాడిపోతున్నారు. ముందు గంట మాత్రమే కోత విధిస్తామని కోతలు కోసిన ట్రాన్స్‌కో ఎస్ఇ నందకుమార్ వరంగల్ జిల్లా భూపాలపల్లిలో 500 మెగావాట్ల విద్యుత్ కేంద్రంలో మరమ్మత్తుల కారణంగా నెల్లూరులో ఈ కోత తప్పదన్నారు. 6తేదీ నుంచి మళ్లీ నగరంలో విద్యుత్‌కోత వేళలు అకస్మాత్తుగా మార్చారు. ఉదయం 10 గంటల నుంచి 12 వరకు విద్యుత్ వుండదన్నారు. గ్రామీణ ప్రాంతాల్లో వేళాపాళా లేకుండా విధిస్తున్న విద్యుత్ కోతలకు అక్కడి జనంతోపాటు వివిధ పరీక్షలకు హాజరవుతున్న విద్యార్థులల్లాడి పోతున్నారు.

### పెద్దన్నయ్యలా నాయుడు



నెల్లూరు విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగంలో సర్కిల్ ఇన్స్‌పెక్టర్ శ్రీనివాసులు నాయుడు స్ఫురద్రూపి. ఆయన కొన్నిసార్లు పూర్తిస్థాయి పోలీస్ క్రాఫ్‌తో కనపడతారు. మరికొన్నిసార్లు పొడవైన మీసంతో ఆకట్టుకొంటారు. ఈవారంలో కస్తూరిబా కళాక్షేత్రంలో జరిగిన ఉగాది వేడుకలకు తెల్లని గ్లాస్కో ధోవతి, పొందూరు ఖద్దరు చొక్కా, పైన కండువాతో హాజరయ్యారు. ఆయన ఆ గెటప్ హీరో బాలకృష్ణను తలపింప చేయడంతో అక్కడున్న అందరూ ఆయన్ను 'పెద్దన్నయ్య' అని వాఖ్యానించడం వినిపించింది.

### అప్పుపడ్డ ఎస్పీ



నెల్లూరు ఎస్పీ దామోదర్‌లో కాస్త కళాతృష్ణ దాగుంది. ఈ తృష్ణతోనే ఆయన శ్రీనాథుడు, యోగివేమన నాటకాల ప్రదర్శనలో అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొన్న గుమ్మడి గోపాలకృష్ణతో కస్తూరిబా కళాక్షేత్రంలో గతవారం పద్య నాటక ప్రదర్శనలు ఏర్పాటు చేశారు. రాజు తలచుకొంటే దెబ్బలకు కొదవా అన్నట్లు నగరంలోని అన్నిపోలీసు స్టేషన్ల ఎస్ఐలకు ఒక్కో బాధ్యత అప్పగించడంతో బాస్ అభిమానం పొందను అందరూ కష్టపడడంతో నాటకాలు రక్తికట్టాయి. అన్ని పోలీసు స్టేషన్ల నుంచి నజరానాలు అందినా ఎస్పీగారు యాభైవేల రూపాయలు రకరకాల చెల్లింపులకు గాను అప్పుపడినట్లు విశ్వసనీయంగా తెలిసింది. దీన్నెలా తీర్చాలన్న దీర్ఘాలోచనతో ఎస్పీ వున్నారు.

# వారఫలాలు

*తేది 9-4-2011 నుండి 15-4-2011 వరకు మీనంలో రవి, కుజ, బుధ; గురువులు; కుంభంలో శుక్రుడు; ధనుస్సులో రాహువు; కన్యలో శని; మిథునంలో కేతువు; మిథున, కర్కాటక, సింహాల్లో చంద్రుడు సంచరిస్తారు.*




సోదరులు అన్నివిధాల చేయూతనిస్తారు. నూతన ప్రయత్నాలలో అత్యధిక శ్రద్ధ చూపుతారు. పాత సమస్యలకు మంచిపరిష్కారం కనుగొంటారు. దగ్గరి ప్రయాణాలు లాభకరంగా ముగుస్తాయి. ప్రతి పని సులువుగా శ్రమలేకుండా చేసి ముగిస్తారు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు కోరుకొన్న రీతిలో జరుగుతాయి. సంతానమూలంగా సుఖశాంతులుంటాయి. వాహనాలు రిపేరుకు వచ్చి ఖర్చులధికమవుతాయి.




గృహాలంకరణలో ఆసక్తి చూపుతారు. వృత్తిలో పదోన్నతికి అవకాశాలు మెండు. వేతనోన్నతికి కూడ. వివాహ ప్రయత్నాలు చక్కగా ఫలిస్తాయి. ప్రయాణాలు సుఖాంతమవుతాయి. ధనాదాయ ప్రాప్తిలో ఆటంకాలు తొలగుతాయి. ఆత్మవిశ్వాసం పెరిగి పనులు అత్యంత సులువుగా చేసుకుపోతారు. సోదరుల కుటుంబానికి సంబంధించి శుభ వార్తాశ్రవణం ఉండవచ్చు. ఆధ్యాత్మికచింత అధికమవుతుంది.




ఉత్సాహం, సుఖసంతోషాలు అధికంగా అనుభూతిలోకి వస్తాయి. ఇంటికి కావలసిన వస్తుజాతాల్ని చేర్చుకోవడంలో నిమగ్నులై వుంటారు. కుటుంబసభ్యుల అభిప్రాయాలకు ప్రాముఖ్యమివ్వాలి. శ్రమ, అలసట తప్పదు. ఉద్యోగ స్థానాల్లో మీ పలుకుబడి పెరిగి తృప్తినిస్తుంది. వారాంతంలో వృత్తిరీత్యా మీరు తీసుకొన్న నిర్ణయాల్లో హఠాత్పరిణామాలు చోటు చేసుకొంటాయి. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త.




ఇతరులకుమేలైన సాయాన్నందిస్తారు. మొదలుపెట్టిన పనుల్ని తుదికంటా చేయడానికి స్నేహితులు చేయూతనిస్తారు. వృత్తిరీత్యా చక్కని ఫలితాలుంటాయి. ఆశ్చర్యపడేరీతిలో ప్రియ వార్తాశ్రవణం చేస్తారు. చుట్టుపక్కలవారు సన్నిహితులు పొగిడేరీతిలో పనులు చేస్తారు. కుటుంబసభ్యుల నడుమ ప్రతిష్ఠ పెరుగుతుంది. ఖర్చులు ఊహించి దానికంటే అధికంగా ఉంటాయి.




ప్రతి పనిలో నిదానం అవసరం. అప్పుడే మనశ్శాంతి లభిస్తుంది. మీ నిరీక్షణ ఫలించి ఎదురుచూసిన వ్యక్తితో సంభాషణ చేస్తారు. దూర ప్రయాణాలు సత్ఫలితాలనిస్తాయి. ఆంత్ర బాధలుండవచ్చు. ధన విషయంలో లోపముండదు. ఎదురుచూసిన రీతిలో ధనప్రాప్తి. ఆగిపోయిన పనుల్ని హుషారుగా పూర్తిచేస్తారు. ఉద్యోగులకు పదోన్నతి అవకాశాలు. సోదరులతో సత్సంబంధాలు నెలకొంటాయి.




నూతన వాహనప్రాప్తి లేదా వాహనరిపేర్ల అవకాశాలున్నాయి. వృత్తి అభివృద్ధికి తోడ్పడే వ్యక్తుల్ని కలుసుకొంటారు. ఉద్యోగరీత్యా ఎదురుచూచిన ఆర్థిక లాభాలు చేతికి అందివస్తాయి. ముఖ్యులనుండి ప్రియ వార్తాశ్రవణం. చుట్టుపక్కలవారితో, బయటప్రపంచంతో సత్సంబంధాలుంటాయి. ఇల్లు, ప్లాటు మొదలైనవి కొనే ప్రయత్నాలు ఊపందుకొంటాయి. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు లాభకరంగా ముగుస్తాయి.

## పంచాంగం

12తేదీ శ్రీరామనవమి.
శ్రీభద్రాద్రి సీతారామ కళ్యాణోత్సవం.
14తేది అంబేద్కర్ జయంతి.
16తేది మహవీర జయంతి.

**ఏప్రెల్ తిథులు**

**చైత్ర శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 9 | శని | షష్ఠి | తె.5.54 | గం.ల.వ |
| 10 | ఆది | సప్తమి | తె.5.52 | గం.ల.వ |
| 11 | సోమ | అష్టమి | తె.5.07 | గం.ల.వ |
| 12 | మంగళ | నవమి | రా.3.38 | గం.ల.వ |
| 13 | బుధ | దశమి | రా.1.28 | గం.ల.వ |
| 14 | గురు | ఏకాదశి | రా.10.40 | గం.ల.వ |
| 15 | శుక్ర | ద్వాదశి | సా.7.24 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




మీ కార్యనిర్వహణా సామర్థ్యం బహిర్గతమవుతుంది. స్థిరాదాయానికి తగిన పథకాలు ఏర్పరుచుకొంటారు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు ఫలవంతమవుతాయి. కుటుంబంలో సుఖసంతోషాలు నెలకొంటాయి. ఎలాంటి సమస్యలనైనా ఉత్సాహంగా ఎదుర్కొంటారు. ఆధ్యాత్మికగురువులను కలుసుకొంటారు. నిరీక్షిస్తున్న డబ్బు చేతికందుతుంది. బాకీలు వసూలవుతాయి.




ఇరుగుపొరుగువారితో సంబంధాలు చక్కగా ఉంటాయి. దొంగచాటు శత్రువులు దూరమవుతారు. వైద్యసంబంధిత ఖర్చులు తప్పవు. పొదుపు చేసుకొన్న డబ్బు కరిగి పోయే సమయం. పథకం ప్రకారం చేయదలచిన పనుల్లో ఆటంకాలు. వృత్తిరీత్యా అభివృద్ధికి గాను తోటివారి తోడ్పాటు బాగా లభిస్తుంది. కళత్ర సంబంధీకుల నుండి మంచిపరిణామాలు ఎదురు చూడవచ్చు.




వృత్తిరీత్యా అభివృద్ధికి తోటివారి తోడ్పాటు బాగా లభిస్తుంది. పథకం ప్రకారం చేయదలచిన పనుల్లో ఆటంకాలు. ఇరుగుపొరుగువారితో సంబంధాలు చక్కగా ఉంటాయి. దొంగచాటు శత్రువులు దూరమౌతారు. భాగస్వాముల వల్ల మోసపోతారు. శ్రమాధిక్యత. ఆర్థిక ఒప్పందాలు పనికి రావు. వైద్యసంబంధిత ఖర్చులు తప్పవు. పొదుపు చేసుకొన్న డబ్బు కరిగి పోయే సమయం.




దైవపూజా కార్యక్రమూలతో మనశ్శాంతి లభిస్తుంది. చేతికందిందంతా పూర్తిగా ఖర్చు చేస్తారు. ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకొని ఇబ్బందులు కొని తెచ్చుకోవద్దు. కళత్రసంబంధం కొంతవరకు మెరుగు. వ్యాపారాదులలో వచ్చిన నష్టాలను ఒక విధంగా పూడ్చుకొంటారు. బంధుమిత్రులు తమ వంతు సాయమందిస్తారు. అడ్డు తగిలి ఆగిపోయిన పనులు ఊపందుకొంటాయి.




ఆర్థికలావాదేవీలు సరియైన రీతిలో నిర్వహించి విజయం సాధిస్తారు. ఆగిపోయిన పనుల్ని మళ్లీ ఉత్సాహంతో పూర్తి చేస్తారు. కోరినవి కోరిన రీతిలో జరుపుకొంటారు. వృత్తి పురోభివృద్ధి విషయంలో అధిక శ్రద్ధ చూపుతారు. నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడుతుంది. వృత్తిరీత్యా కొత్తగా ఒప్పందాలు చేసుకొంటారు. ఉద్యోగులకు అధికారుల ఆదరణ ఉంటుంది.




మీ కార్యనిర్వహణా సామర్థ్యం బహిర్గతమవుతుంది. స్థిరాదాయానికి తగిన పథకాలు ఏర్పరుచుకొంటారు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు ఫలవంతమవుతాయి. కుటుంబంలో సుఖ సంతోషాలు నెలకొంటాయి. ఎలాంటి సమస్యలనైనా ఉత్సాహంగా ఎదుర్కొంటారు. ఆధ్యాత్మికగురువులను కలుసుకొంటారు. నిరీక్షిస్తున్నడబ్బు చేతికందుతుంది. నూతనోత్సాహంతో ధైర్యంతో పనుల్లోకి దూకుతారు.

# ఆయం, వర్గు దిశా నిర్ణయాలు అనర్థ హేతుకారకాలు!

*కె.చలపతి — సూళ్లూరుపేట*

* *నా పేర 'చవర్గు' వస్తుందని దక్షిణ దిశ శ్రేష్ఠమని ప్రాచీన వాస్తు శాస్త్రంలో చదివాను.*

ఆధునిక యుగంలో 'వర్గు' ఆచరణీయం కాదు. మీకు దక్షిణం శ్రేష్ఠమే. రేపు మీ కుమారుదుది 'యవర్గ' అయి అతనికి ఉత్తర దిక్కు శ్రేష్ఠమవుతుంది. వర్గుల్ని బట్టి గృహ నిర్మాణం ఇప్పటి కాలంలో అర్థరహితం, అనర్థ హేతు కారణం.

*పి.రామారావు — సికింద్రాబాద్*

* *నాది 'జ్యేష్ఠ' నక్షత్రం. ధ్వజాయం తూర్పు దిశా స్థలం కలసి వస్తుందని సిద్ధాంతి చెప్పారు.*

ఆయం 'ప్రాణ స్థితికి' మూలాధారం. మీకు ధ్వజాయం. మీ పుత్ర సంతతిది 'రేవతి' వృషభాయం అతను మళ్లీ కొలతలు మార్చుకోవాలి. ధరలు చుక్కలనంటుతున్న ఈ కాలంలో ఇళ్లు పడగొట్టి ఆయం, వర్గుల ప్రకారం కట్టుకోవడం అసాధ్యం. ఆధునిక శాస్త్రవేత్తలు వీటిని ఛాందసాలంటున్నారు.

*వి.విజయల్‌రెడ్డి — పొదలకూరు*

* *గ్రహాలలో నపుంసక గ్రహాల్ని గురించి చెబుతారా?*

బుధుడు, శని, కేతువు మొదలైన గ్రహాలు నపుంసక గ్రహాలుగా శాస్త్రాలు చెబుతున్నాయి.

*డి.శుచీంద్రరావు — ఆత్మకూరు*

* *దిక్కుల్ని బట్టి దోషాల్ని కనిపెట్టడం ఎలా?*

మగ పిల్లవాళ్లు భ్రష్టులైతే తూర్పు, పశ్చిమ దిశాదోషాలున్నట్లు, స్త్రీల సమస్యలుంటే ఉత్తర, దక్షిణ దిశా దోషాలున్నట్లు పసిగట్టవచ్చు.

*వింజమూరు ప్రహ్లాదరావు — చెన్నై*

* మెదడు అనారోగ్యవంతమయినపుడు మా చిన్నాన్న రత్నధారణ చేసి ఆరోగ్యవంతుడయ్యాడు ఆశ్చర్యంగా.

నవరత్నాలు, రంగులకు, ఘనీభవ ద్రవాలకు సంబంధించినవి. రాళ్లు, రంగుల ప్రభావాలు ప్రపంచ సైన్సు శాస్త్రజ్ఞులే నమ్ముతున్నారు. జ్యోతిష శాస్త్రంలో ఒక చోట అన్నారు "శక్తి మాత్రమే గాక, నమ్మకం కూడా ఔషధంలా పనిచేస్తుందని."

*ఎన్.ఊర్మిళానాయుడు — సికింద్రాబాద్*

* *గురుమౌఢ్యం, శుక్రమౌఢ్యం వీటిని గురించి చెప్పండి?*

కర్తరి(కత్తెర), మౌఢ్యమి(మూఢం) రోజుల్లో వాస్తు ప్లానులు, జ్యోతిషం, ఇతర పూజా విధానాలు చేసుకోవచ్చును. శంకుస్థాపనలు, గృహారంభాలు చేయరు. అయితే శుక్రమౌఢ్యమికే పాటింపు, గురు మౌఢ్యమికి లేదని 'జ్యోతిష రాజవల్లభం' చెబుతోంది.

*తాడిన అరుణ — గుంటూరు*

* *పశ్చిమ ఇల్లు. మిద్దెపై తూర్పు, ఆపై ఉత్తరం వాకిళ్ల ఇళ్లు వున్నాయి.*

రాజవీధివైపే అన్ని గృహాలు వుండాలి. మీరలా నిర్మిస్తే విదిశాదోషాలు, దిక్పతనాలు సంభవించి ఆర్థిక పరిస్థితి, మానసిక వత్తిళ్లు అధికమవుతాయి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*జి.వి.పరంధామయ్య — నెల్లూరు*

* *ఇల్లు నిర్మాణం రోడ్డుకెదురుగానే వస్తుంది. అయితే వెనుక నుంచి చూస్తూ దిక్కు మూలకు తిరిగినట్లవుతుంది.*

నెల్లూరు స్పిన్నింగ్‌మిల్స్ లే అవుట్‌లో విపరీతమైన దోషాలున్నాయి. రోడ్ల నిర్మాణంలో తప్పులు ప్లాట్ల విభజనలో చేసిన తీవ్రమైన దోషాలు వెరసి అక్కడి కోణ, దిక్, విదిక్ దోషాలకు కారణమౌతున్నాయి.

*జి.అనూరాధారెడ్డి — కావలి*

* *'విరుద్ధ దిక్కులు, దిక్పతనం' అంటుంటారు. అంటే ఏమిటి?*

తూర్పు రోడ్డు స్థలంలో ఉత్తర సింహద్వార గృహం లాంటివి నిర్మించడం. అందులో తూర్పు వాస్తు బదులు, ఉత్తరం వాస్తు పాటిస్తారు. అందువల్ల వాస్తు, దిక్కులు భ్రష్టమవుతాయి. యజమానులు అనారోగ్య, ఆర్థిక సమస్యలనెదుర్కొంటారు.

*కనుమల పవిత్ర — ఆత్మకూరు*

* *మా యింటికి పశ్చిమ, దక్షిణ దిశల్లో పంట కాలువలు ప్రవహిస్తున్నాయి.*

పశ్చిమ(వరుణ), దక్షిణ(యమ) స్థానాలలో ప్రవాహాలు గృహ కలహాలకు కారణమవుతాయి. కూర్మ, మత్స్య యంత్ర ప్రతిష్టలు కొంత శాంత దోషాల్ని పరిహరిస్తాయి.

*కందల ఆరణి — నాయుడుపేట*

* *ఇంటికి ఏ దిశలో స్వంత పొలాలు వుండకూడదు?*

స్వగృహానికి వీపు భాగంలో ఆగ్నేయం, వాయువ్యం, నైరుతి దిక్కుల్లో పంట పొలాలు (స్వంతవి) ఉండకూడదు. అలా వుంటే సుదర్శన యంత్ర ప్రతిష్ట దుష్ఫలితాల్ని తగ్గిస్తుంది.

# కులదూషణ కేసుల్లో
# దర్యాప్తు నిదానం!

> జిల్లాలో నమోదవుతున్న కులదూషణ కేసులు తక్షణం విచారించి బాధితులకు న్యాయం చేకూర్చాల్సిన పోలీసు శాఖ ఆ దిశగా చర్యలు చేపట్టడం లేదు.



అట్రాసిటీ కేసుల విషయమై పోలీసు అధికారులతో ఏర్పాటు చేసిన సమీక్షలో జిల్లా కలెక్టర్ రామ్‌గోపాల్.

జిల్లా వ్యాప్తంగా అట్రాసిటి కేసులు నమోదవుతుండగా వాటిని త్వరితగతిన పరిష్కరించడంలో పోలీస్‌శాఖ విఫలం చెందుతుంది. షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగల వారిపై జరిగే దాడులు, మహిళలపై అత్యాచారాలు నిరోధించాలన్న లక్ష్యంతో 1989 సంవత్సరంలో అట్రాసిటి యాక్టును కేంద్రప్రభుత్వం అమల్లోకి తీసుకొచ్చింది. ఈ చట్టం ఎవరికోసం వుద్దేశింపబడిందో వారికి మాత్రం కేసుల విషయంలో అన్యాయం జరుగుతూనే వుంది. గ్రామాల్లో రాజకీయ కక్షల నేపథ్యంలో దళితులను పావులుగా వాడుకొంటూ గిట్టని వారిపై అట్రాసిటి కేసులు నమోదు చేయిస్తున్నారు.

కులం పేరుతో తిట్టకపోయినా, దాడులు చేయకపోయినా చేసినట్లు సంబంధిత పోలీస్ స్టేషన్లలో ఫిర్యాదులు అందుతున్నాయి. అట్రాసిటి యాక్టు కింద ఫిర్యాదు అందిన వెంటనే రాజకీయ ఒత్తిళ్ల కారణంతో పోలీసులు కేసు నమోదు చేయక తప్పడం లేదు. వాస్తవంగా దాడులకు గురికాబడి, కులం పేరుతో దూషించిన వారిపై ఫిర్యాదు చేస్తే మాత్రం పోలీసులు రాజీ చేసుకోమని బాధితులపై ఏదోఒక రూపంలో ఒత్తిడి తెస్తుంటారు. ఒకవేళ కేసు నమోదు చేసినా నిందితులను వెంటనే అరెస్టు చేయకుండా చూసీచూడనట్లు వదిలేస్తుంటారు. దీంతో అట్రాసిటి యాక్టు దుర్వినియోగం జరుగుతుంది.

నిందితులను సకాలంలో అరెస్టు చేసి శిక్షలు పడేటట్లు చేస్తే భవిష్యత్‌లో దళితులపై దాడులు జరపడం, కులాల పేరుతో దూషించడం వంటి సంఘటనలు జరగవు. కేసు నమోదు చేసిన పోలీసులు ఆర్థిక సహాయం కోసం జిల్లా కలెక్టర్‌కు నివేదించి చేతులు దులుపుకొంటున్నారు. నిందితులకు కఠిన శిక్షలు పడకపోవడంతో అట్రాసిటి యాక్టు అంటే లెక్క లేకుండాపోయింది. జిల్లాలో అట్రాసిటి కేసుల పరిష్కారం కోసం మానిటరింగ్ కమిటీ వున్నప్పటికి కమిటి సభ్యుల మధ్య సమన్వయం లేకపోవడంతో కేసుల విషయం సమగ్రంగా పరిశీలన చేయలేకపోతున్నారు.

జిల్లా కలెక్టర్ అధ్యక్షతన ప్రతి మూడు నెలలు, ఆరునెలలకోసారి అట్రాసిటి కేసులపై సమీక్ష జరుపుతున్నా పురోగతి కనిపించడం లేదు. ఎస్సీ, ఎస్టీ సంక్షేమశాఖలకు చెందిన అధికారులు సమావేశంలో పాల్గొంటున్నా బాధితులకు ప్రభుత్వ నిబంధనల ప్రకారం అందించాల్సిన ఆర్థిక సహాయం అందించేందుకు ఒక్కరూ కృషి చేయడం లేదన్న విమర్శలు వున్నాయి. అట్రాసిటి కేసులను విచారణ చేసే అధికారం డిఎస్పీలకు వుంటుంది. కొందరు డిఎస్పీలు సకాలంలో విచారణ చేస్తుండగా మరి కొందరు నెలల తరబడి కాలయాపన చేస్తున్నారు. గ్రామ రాజకీయాల ఆధిపత్యంలో కొందరు బాధితులు పోలీస్‌స్టేషన్‌కు రాలేని పరిస్థితి వుంది.

అట్రాసిటి చట్టాన్ని పరిరక్షించి బాధితులకు న్యాయం చేకూర్చాల్సిన పోలీస్‌శాఖ ఆ దిశగా చర్యలు చేపట్టడం లేదు. ఇప్పటికైనా పోలీస్‌శాఖ స్పందించి ఈ చట్టం దుర్వినియోగం జరగకుండా చర్యలు తీసుకోవడంతోపాటు నిందితులకు కఠిన శిక్షలు పడే విధంగా కృషి చేస్తే బాగుంటుంది.

# ఆకట్టుకోని 'శక్తి!



✍ అల్లూరు రహీం

తెలుగు తెరపై ఉవ్వెత్తున ఎగిసి పడిన యువ తరంగం ఎన్టీఆర్‌ను హీరోగాపెట్టి వైజయంతీ మూవీస్ పతాకం తీసిన భారీ బడ్జెట్ చిత్రం శక్తి. ఈ చిత్రానికి కథ, కథనం, దర్శకత్వం మెహర్ రమేష్. ఈయన గతంలో ఎన్టీఆర్ హీరోగా కంత్రీ చిత్రాన్ని తీశాడు. బిల్లా చిత్రాన్ని బాగా తెరకెక్కించిన దర్శకునిగా పేరుగాంచాడు. అటువంటి దర్శకుడు శక్తి లాంటి సోషియోఫాంటసీ చిత్రాన్ని రసరమ్యంగా తీస్తాడని ప్రేక్షకులు ఆశించారు. కాని ఆయన అందరి ఆశలను ఒమ్ము చేస్తూ మూడు గంటల పాటు సాగదీసిన కథకు తోడుగా రెండున్నర కోట్ల రూపాయలు ఖర్చు పెట్టించిన గ్రాఫిక్స్, మరో రెండున్నర కోట్ల రూపాయలు వెచ్చించి వేయించిన సెట్టింగ్స్ మెప్పింపజేయలేదు. టాలీవుడ్‌లో సూపర్ హీరోయిన్ ఇలియానా అందచందాలు శక్తిని కాపాడలేదంటే సినిమా ఎట్లుందో అర్థం చేసుకోవచ్చు. భారతదేశ హోంమంత్రి ఎంత శక్తిమంతుడు? కాని ఈ సినిమాలో ఆయన మాఫియా శక్తులను ఒక ఖడ్గం కోసం రహస్యంగా కలుస్తాడు. ఈజిప్ట్ తాంత్రికులను చూసి బెంబేలెత్తిపోతాడు. నేషనల్ సెక్యూరిటీ ఫోర్స్ అధిపతిని ఓ ఈజిప్ట్ బచ్చా కొడితే ఆయన క్రింద పడి గిలగిల కొట్టుకొంటాడు. ఇటువంటి సన్నివేశాలు శక్తిలో కోకొల్లలు. దర్శకుడు ఎంచుకొన్న కథలోని అష్టాదశ శక్తి పీఠాలను మించిన శక్తి పీఠం మీద వుండే జగన్మాత ఆదిపరాశక్తి చేతిలోని శూలం శక్తిని గూర్చి చెప్పడం. దీనికోసం దర్శకుడు ఈజిప్ట్, దుబాయ్, లడక్‌లతోపాటు హరిద్వార్‌లోని కుంభమేళాలలో షూటింగ్ చేసినా ఎందువల్లో ఆ సన్నివేశాలు అబ్బురపరచ లేదు. దర్శకుడు కథను యండమూరి వీరేంద్రనాథ్, సత్యానంద్ వంటి చేయి తిరిగిన రచయితల చేత ట్రీట్‌మెంట్ చేయించినా ఫలితం లేదు. శక్తి కథను రెండున్నర గంటల్లో స్పీడ్ స్క్రీన్‌ప్లేతో చెప్పి వుంటే బాగుండేది. రెండు పాటలు తాలియా.... తాలియా, ప్రేమదేశం యువరాణి మినహా మిగతావి కర్ణపేయంగా లేవు. మణిశర్మ రొటీన్ సంగీతంలో శబ్దాల హోరు తప్ప సాహిత్యం వినపడదు. ఆనంద్ సాయి వేసిన పాతాళభైరవి సెట్టింగ్ పాత సినిమా సెట్టింగ్‌తో పోల్చుకొంటే గొప్పగా లేదు. సమీర్‌రెడ్డి కెమెరా సరిగ్గా లేదు. అయితే స్టన్ శివ చిత్రీకరించిన పోరాటాలు బాగున్నాయి. గుచ్చాంగే పాటను రోబోలో పాటలా, ప్రేమదేశం యువరాణి పాటను జగదేకవీరుడు అతిలోక సుందరి చిత్రంలోలా చిత్రీకరించే పనిలో దర్శకుడు విఫలమయ్యాడు. చిత్రంలో అతి ముఖ్యమైన స్వామి పాత్రకు నాజర్ చాలలేదు. ఈజిప్ట్ క్రూరునిగా సోనూసూద్ బాగున్నాడు. అతని భార్యగా పూజా బేడి ముఖాన ఫీలింగ్స్ పలకలేదు. రెండుపాత్రల పోషణలో ఎన్టీఆర్ పరవాలేదనిపించాడు. హీరోయిన్ ఇలియానా పైటాపావడా ధరించి కనపడే పాటలో మాత్రం బాగుంది. చాలా రోజుల తర్వాత మాటలు వ్రాసిన సత్యానంద్ ఈ తరానికి పనికిరాడన్నట్లు ముసలి మాటలు వ్రాశాడు.




ఇక చిత్రకథలోనికి వెళ్తే దేశ హోంమంత్రి మహదేవరాయ(ప్రభు) కుమార్తె ఐశ్వర్య(ఇలియానా) తనపై విధించే సెక్యూరిటీ ఆంక్షలు తట్టుకోలేక చెప్పాపెట్టకుండా ఇంట్లో నుంచి జైపూర్ చెక్కేస్తుంది. ఇక్కడ ఆమెకు శక్తి (ఎన్టీఆర్) గైడ్‌గా పరిచయమవుతాడు. తొలుత ఇతని చేష్టలు ఐశ్వర్యకు నచ్చకపోయినా కాశ్మీర్ మంచుకొండల్లోని లోయలో పడినప్పుడు ప్రాణాలు రక్షించడంతో ఫిదా అయిపోతుంది. ఇది ఇలా వుండగా ఈజిప్టులోని పురాతన తెగకు చెందిన ముఖ్తార్(సోనూసూద్) భారతదేశంలోని అష్టాదశ శక్తి పీఠాలను మించిన ఆదిపరాశక్తి పీఠం దగ్గర వున్న ఖడ్గం కోసం ఏళ్లతరబడి ప్రయత్నాలు చేస్తుంటాడు. దీన్ని సాధిస్తే ప్రపంచ ఆధిపత్యంతోపాటు పిరమిడ్లలోని మమ్మీలను బ్రతికించవచ్చని ఆదిపరాశక్తి పీఠం వద్ద 27ఏళ్లకొకసారి మాత్రమే పూజ చేయగలరు. ఈ పీఠంలోనికి ప్రవేశించను అవసరమైన జ్వాలాముఖి వజ్రం మహదేవరాయ వద్ద వుంటుంది. దీన్ని పొరపాటున ఐశ్వర్య తనతో తీసుకోవెళ్లగా ఈజిప్ట్ గ్యాంగ్ వెంబడిస్తారు. ఆమెను కిడ్నాప్ చేయబోగా ప్రక్కనే వుండే శక్తి తన విశ్వరూపం ప్రదర్శిస్తాడు. అతను నేషనల్ సెక్యూరిటీ ఫోర్స్‌లో ప్రత్యేక అధికారి అని తెలుసుకొని ఐశ్వర్య మురిసిపోతుంది. వాస్తవానికి ఐశ్వర్య, శక్తి కారణజన్ములని స్వామి(నాజర్) చెబుతాడు. ఒకసారి దేవాలయంలో వారిద్దరి చేతి స్పర్శతో జ్వాలాముఖి వజ్రం అద్భుతకాంతులీనుతుంది. గతంలో మహదేవరాయ కుటుంబం వద్ద వుండిన జానకివర్మ(జాకీ ష్రాఫ్) అతి శక్తివంతమైన ఖడ్గాన్ని పట్టుకవెళ్లి దుబాయ్‌లో అమ్మకానికి పెడతాడు. స్వామి శక్తికి అతను శక్తి పీఠ రక్షకుడు మహారుద్ర(ఎన్టీఆర్) కుమారుడని గతంలో ఈజిప్ట్ తెగతో జరిగిన పోరాటంలో ప్రాణాలు కోల్పోయాడంటాడు. దీంతో రెచ్చిపోయిన శక్తి దుబాయ్‌వెళ్లి ఖడ్గం తేవడంతో పాటు ఈజిప్ట్ తాంత్రికురాలు ఫక్తూనీ(పూజాబేడి)ని చంపి శక్తి పీఠ ఔన్నత్యాన్ని కాపాడడంతో సినిమా ముగుస్తుంది. ◆J

## ఎన్టీఆర్ సరసన పాయల్‌ఘోష్



కొంతమంది హీరోయిన్లకు తొలిచిత్రంతో కాస్తో కూస్తో గుర్తింపు దక్కినా అవకాశాలు వెంటనే పలకరించవు. మరికొందరికి అందరూ మరచిపోయిన తరుణంలో అవకాశం తలుపు తడుతుంది. పాయల్ ఘోష్ పరిస్థితీ అలాగే వుంది. మనోజ్ హీరోగా నటించిన ప్రయాణం చిత్రంతో టాలీవుడ్‌లోనికి వచ్చిన బెంగాలీభామ పాయల్. ఆ సినిమా తరువాత ఆమెకు అవకాశాలు రాలేదు. అడపాదడపా హైదరాబాద్‌లోని షాపుల ప్రారంభోత్సవాల్లో మెరిసేది. ఇప్పుడేమో ఏకంగా జూనియర్ ఎన్టీఆర్ సరసన నటించే ఛాన్స్ కొట్టేసింది. సురేందర్‌రెడ్డి దర్శకత్వంలో బీవీఎస్ఎన్ ప్రసాద్ ఓ చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఇందులో ఎన్టీఆర్, తమన్నా జంటగా నటిస్తారు. మరో హీరోయిన్‌గా పాయల్ నటిస్తుంది. ఈ అవకాశం రావడం పట్ల ఆమె చాలా ఆనందాన్ని వ్యక్తం చేస్తుంది.

## ముద్దులు మాస్ కోసం...



ఇటీవల విడుదలైన రాజ్ సినిమాలో బోల్డ్‌గా నటించడంతోపాటు రెండు మూడు సన్నివేశాల్లో హీరోకు ప్రియమణి ముద్దులు పెట్టడం చర్చనీయాంశమయ్యింది. ఈ విషయమై ఆమెను అడిగితే ముందు ఓ నవ్వు నవ్వింది. ఆ తర్వాత మాట్లాడుతూ కథానుసారం అలా నటించాల్సి వచ్చింది. ఆ సన్నివేశంలో ముద్దుపెట్టడం అవసరమే. అందులో తప్పేంలేదనుకొంటున్నాను. నా నుంచి ఎప్పుడూ ఒకే తరహా పాత్రలు ప్రేక్షకులు ఆశించడం లేదు. క్లాస్ పాత్రలు ఎప్పుడోగాని రావు. ఇక్కడ మాస్‌ని మెప్పిస్తే చాలు. అయితే ఇదే చాలా కష్టం. ఒకసారి వాళ్ల ఆదరణ లభించిన తరువాత ఇక ఎలా కనిపించినా ఆదరిస్తారు. రాజ్‌లో మాస్‌ను మెప్పించనే ముద్దులు పెట్టడానికి ఒప్పుకొన్నానని తేల్చి చెప్పేసింది ప్రియమణి.

## నటించను పాత్రలేవీ?



వేదం, మిరపకాయ్, వాంటెడ్ సినిమాల్లో హీరోయిన్ దీక్షా సేథ్ నటించను పాత్రలు లేకే గ్లామర్‌తో నెట్టుకొస్తున్నానంది. తమిళంలో రెండు చిత్రాల్లో నటిస్తున్న ఆమె షూటింగ్ గ్యాప్‌లో మాట్లాడుతూ కనువిందుగా కనిపించేది గ్లామర్. ప్రేక్షకుల్లో గుబులు రేపేది గ్లామర్. ఈ రోజుల్లో గ్లామర్‌గా కనిపించడం తప్పనిసరి అయిపోయింది. ఎక్స్‌పోజింగ్ చేయాల్సివస్తుంది. మనసులో మాత్రం ఇలా చేయాలని వుండదు. నటన ఒలికించే పాత్రలు హీరోయిన్లకు దక్కడం లేదు. అందువల్ల దేహప్రదర్శన తప్పడం లేదు. ఇద్దరు హీరోయిన్లు వున్న చిత్రాల్లోనూ నటిస్తాను. తెలుగు చిత్రాలకే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తానంటుంది దీక్షాసేథ్.

## మాధురి ఆశబోతుతనం



మాములుగా సెకండ్ ఇన్నింగ్స్ ప్రారంభించే నాయికలు పారితోషికం విషయంలో పట్టుదలకు పోరు. రేటు కాస్త అటూ ఇటూ అయినా సర్దుకపోతారు. కానీ మాధురీ దీక్షిత్ అలా కాదు. ఐదు కోట్లు ఇస్తేనే సినిమా చేస్తానంటుంది. ఛోళీకే పీచే క్యాహై అంటూ కుర్రకారుని ప్రశ్నించిన నాయిక మాధురీ దీక్షిత్. ఆజానాచ్‌లే సినిమాలో తన రెండో ఇన్నింగ్స్‌కు శ్రీకారం చుట్టింది. కాని ఆ సినిమా బాక్సాఫీసు దగ్గర విజయం సాధించలేదు. ఈ మధ్య ఓ నిర్మాత ఆమెను తమ సినిమాలో నటించమని అడిగితే... నటిస్తాను... అయితే పారితోషికం క్రింద ఐదుకోట్ల రూపాయలు ఇస్తారా అని అడిగిందట. దీంతో ఆ నిర్మాత కంగారు పడిపోయాడు. అంత మొత్తం పెట్టుకొంటే దీపికా పదుకొణే లాంటి ఈతరం హీరోయిన్‌ను నా సినిమాలో నటింపచేయనా అంటున్నాడు.

## ఎదగాలంటే ఎన్ని తిప్పలో...



పరిశ్రమలో ఏ హీరోయిన్ అయినా సినిమా ఆడకపోతే అంతే సంగతులంటుంది హీరోయిన్ విద్యాబాలన్. ఏ రంగంలో వున్నా ఈ సమస్య తప్పదేమో అంటుంది. ఆఫీసులో పని ఒత్తిడి వల్ల ఇంట్లో నిద్రపట్టకపోవచ్చు. సినిమా రంగం కూడా ఇందుకు భిన్నం కాదు. అవకాశాలు రానంత కాలం వాటి కోసం ఎదురు చూస్తాం. వచ్చిన తర్వాత రేయింబవళ్లు సినిమా కోసం పని చేస్తాం. హిట్ అయితే మళ్లీ సినిమాలు, పోతే మళ్లీ ఎదురు చూపులు. ఇక్కడి జీవితాలు ఇంతే. ఇలాగే వుంటాయి. ఎదగాలంటే నిద్రపోకూడదు. డాక్టర్లు మాత్రం రోజుకు ఎనిమిది గంటలు నిద్ర పొమ్మంటారని చెప్పుకొచ్చింది విద్యాబాలన్.



కార్యకర్తల ఆత్మీయ సమావేశంలో మాట్లాడుతున్న ఎమ్పీ రాజమోహన్‌రెడ్డి.

# ఆనం కాదు హీనం

నెల్లూరు పార్లమెంటు సభ్యుడు మేకపాటి రాజమోహన్‌రెడ్డి ఆనం సోదరులపై నిప్పులుకక్కారు. ఏనాడూ ఎదుటి వారిని పరుషంగా మాట్లాడని ఆయన తన వైఖరికి భిన్నంగా తీవ్రస్థాయిలో విమర్శలు గుప్పించారు. గత కొంత కాలంగా రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి మేకపాటి సోదరులపై విమర్శలు చేస్తున్నారు. ఈ నేపథ్యంలో నగరంలోని అనిల్ గార్డెన్స్‌లో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో ఆత్మీయ సమావేశం జరిగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న రాజమోహన్‌రెడ్డి తమపై ఆనం సోదరులు చేస్తున్న విమర్శలను ప్రస్తావిస్తూ తీవ్రంగా దుయ్యబట్టారు. నీచ రాజకీయాలకు పాల్పడుతున్నామని అంటున్నారు. ఎవరివి నీచ రాజకీయాలు? కుట్రలు, కుతంత్రాలు చేసేదెవరు? మా చరిత్ర ఏమిటో జిల్లా ప్రజలందరికీ తెలుసు. మీరా మమ్మల్ని విమర్శించేదంటూ పరుషంగా మాట్లాడారు. సాధారణ కుటుంబం నుంచి వచ్చిన మేము వ్యాపారాలు చేసుకొని ఈ స్థితికి వచ్చాం. మీ సంగతేంటి? ఏ వ్యాపారాలు చేసి సంపాదించారు? మాట్లాడే ముందు నోరు అదుపులో పెట్టుకో? నీవో పెద్ద మొనగాడివనుకోకు, విర్రవీగిన వాళ్లు అడ్రస్ లేకుండా పోయారు. జాగ్రత్తంటూ మేకపాటి ఆనం సోదరులను దునుమాడారు. ఎన్నడూ కోప్పడని, ఎదుటి వారిని విమర్శించని ఆయన ఈ స్థాయిలో మాట్లాడడం చూసినవారు ఆశ్చర్యపోయారు.

# ఎంజి బ్రదర్స్ గ్రాండ్ సిటీ

## వీరంపల్లి రోడ్డులో సరికొత్త వెంచర్


వెంచర్ బ్రోచర్‌ను విడుదల చేస్తున్న జెవిఎస్ రెడ్డి, ఎంజి గంగాధర్.

ఆటోమొబైల్స్ రంగంలో నెల్లూరీయుల అభిమానం పొందిన ఎంజి బ్రదర్స్ సంస్థ రియల్ ఎస్టేట్ రంగంలోనూ అడుగు పెట్టింది. ఇప్పటి వరకు ఆ సంస్థ వేసిన సుమధాత్రి నగర్, సుందర్ నగర్, సుమిత్రా నగర్, ఎంజి మెగాసిటీ, సుముఖ నగర్, ఎంజిబి రాయల్ సిటీ లేఅవుట్లలో ఒక్క ప్లాటు మిగలకుండా అమ్ముడుపోయాయంటే ఎంతగా ఈ సంస్థ నెల్లూరీయుల అభిమానం పొందిందో అర్థం చేసుకోవచ్చు. ఈ స్ఫూర్తితోనే నెల్లూరు - చెన్నై జాతీయ రహదారి నుండి వీరంపల్లి పోయే రోడ్డులో సరికొత్త ఎంజిబి గ్రాండ్ సిటీ లే అవుట్‌కు శ్రీకారం చుట్టింది. ఈ కొత్త లే అవుట్‌లో ఎన్నో విశిష్టతలున్నాయి. విశాలమైన 60, 40, 33 అడుగుల వెడల్పుగల మెటల్ రోడ్లు. వీటిని మెటల్‌తో వేశారు. ప్రతి ప్లాటుకు కరెంటు సౌకర్యం, పైపు కల్వర్టులు, రోడ్లకు ఇరువైపులా చెట్ల పెంపకం చేస్తున్నారు. లే అవుట్ చుట్టూ కామన్ ఫెన్సింగ్, భవిష్యత్తులో ప్లాటు కొన్న వారికి ఎటువంటి ఇబ్బందులు రాకుండా భూ వినియోగ మార్పిడితోపాటు నూటికి నూరు శాతం క్లియర్ డాక్యుమెంట్స్‌తోపాటు డిటిసిపి అప్రూవల్ కూడా పొందారు. పెట్టుబడి స్వల్పకాలంలోనే రెట్టింపుకు ఎంజి బ్రదర్స్ లేఅవుట్ ప్లాట్లు నెల్లూరులో ఉపయోగపడుతున్నాయనడంలో అతిశయోక్తి కాదు.

# ఆకట్టుకొన్న పద్యనాటకాలు

## వేమన, శ్రీనాథుడి నాటకాలు అద్భుతం


వేమన నాటకంలో ఓ దృశ్యం.

పద్యం తెలుగు వాడికి మాత్రమే సొంతం. అలాంటి పద్యాలతో కూడిన నాటకాలను ప్రదర్శించి నాటక ప్రియులను ఉర్రూతలూగించారు పద్యనాటక కళాపరిషత్ నిర్వాహకులు. హైదరాబాద్‌కు చెందిన శ్రీ సత్యసాయి కళానికేతన్ వారితో కలసి ప్రపంచ ఖ్యాతినార్జించిన పద్యనాటక కళాకారుడు గుమ్మడి గోపాలకృష్ణ వేమన, శ్రీనాథుడిగా నటించిన రెండు పద్య నాటకాలు ప్రదర్శితమయ్యాయి. కస్తూరిబా కళాక్షేత్రంలో రెండు రోజులపాటు ఏప్రెల్ 2, 3 తేదీలలో ప్రదర్శించిన ఈ పద్యనాటకాలు నాటక ప్రియులను ఆనంద పారవశ్యంలో ముంచెత్తాయి. ఆకెళ్ల రచించి, దుగ్గిరాల సోమేశ్వరరావు దర్శకత్వం వహించిన శ్రీనాథుడు నాటకాన్ని, బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రి, డాక్టర్ విజయభాస్కర్ రచనచేసి, గుమ్మడి గోపాలకృష్ణ స్వీయ దర్శకత్వంలో యోగి వేమన నాటకాన్ని ప్రదర్శించారు. రెండు పాత్రల్లో ఆయన అద్వితీయమైన నటకాకౌశలంతోపాటు రాగయుక్తంగా చక్కని కంఠంతో పద్యాలు పలికిన తీరు గుమ్మడి గోపాలకృష్ణ ప్రతిభను మరోమారు లోకానికి చాటిచెప్పింది. శ్రీనాథుడి జీవితం, యోగి వేమన పాత్రలో మొదట రాజరికపు మత్తులో చేసే తప్పిదాలు, తర్వాత యోగిగా మారి ప్రజలను చైతన్యపరచే విధానాన్ని కళ్లకు కట్టినట్లు చూపారు.

# లేపాక్షి వస్త్ర ప్రదర్శన

## లెక్కలేనన్ని చేనేత ఉత్పత్తులు


చేనేత చీరలను చూస్తున్న నటుడు చంద్రమోహన్.

దేశంలో పేరెన్నికగన్న లేపాక్షి సంస్థ చేనేత ఉత్పత్తులతో నగరంలోని టిటిడి కళ్యాణ మండపంలో ప్రదర్శన చేపట్టింది. హస్తకళల అభివృద్ధి సంస్థ ఆధ్వర్యంలో ఏర్పాటుచేసిన ఎగ్జిబిషన్‌ను ప్రముఖ నటుడు చంద్రమోహన్ మార్చి 31వ తేదీన ప్రారంభించారు. దేశంలో పేరొందిన వివిధ ప్రాంతాలకు చెందిన చేనేత కళాకారులు తయారుచేసిన కాటన్, శిల్క్ వస్త్రాలు ఇక్కడ అందుబాటులో వున్నాయి. బెంగాలీ కాటన్ చీరలు, పోచంపల్లి, నారాయణపేట, గద్వాల్, వెంకటగిరి, మంగళగిరి, చీరాల, మధురై కాటన్ వస్త్రాలు, లక్నో చికెన్ వర్క్, ఆప్లిక్ వర్క్, కాంతా వర్క్ చీరలు, కాశ్మీర్ సిల్క్, చెందేరి వస్త్రాలు ఈ ప్రదర్శనలో కొలువుదీరున్నాయి. హర్యానా బెడ్ షీట్స్, కాటన్ ప్రింటెడ్ డ్రస్ మెటీరియల్స్, ఫ్యాన్సీ వస్త్రాలు, విభిన్న మోడల్స్‌లో వున్నాయి. కుర్తా పైజమాలు, కాటన్ షర్ట్స్, చిన్నపిల్లల వస్త్రాలు సైతం దొరుకుతున్నాయి. కాటన్, శిల్క్ వస్త్రాల సమ్మేళనంగా నిర్వహించబడే ఈ ఎగ్జిబిషన్ ఏప్రెల్ 10వ తేది వరకు వుంటుంది.


నెల్లూరు పొగతోటలోని ప్రభవ పుస్తక భాండాగారంలోనే ఏర్పాటుచేసిన కాన్సెప్ట్‌లో విశేష పురుష వస్త్ర ప్రపంచశ్రేణి షోరూంను ప్రారంభిస్తున్న సీనియర్ అడ్వకేట్ వేములపాటి అనంతరామయ్య. ప్రక్కన షోరూం అధినేతలు డాక్టర్ శ్రీధర్, చంద్రలత వున్నారు.

- రచ్చరాజేసిన

# రమేష్‌రెడ్డి!

## పార్టీ పగ్గాలు బాలకృష్ణకు ఇవ్వాలని ఆగం


వివాదాస్పద ప్రకటనలే రమ్మీ శాపం.

జిల్లా తెలుగుదేశం పార్టీలో అంతర్గత కుమ్ములాటలు మరోసారి బట్టబయలయ్యాయి. ఇప్పటికే జరిగిన స్థానిక సంస్థల ఎన్నికల్లో ఓటమి చవిచూడడం, వర్గ విభేదాలు, వెన్నుపోట్ల కారణంగానే ఈ అపజయమని కార్యకర్తలు మథనపడుతున్న తరుణంలో ఎన్టీఆర్ కుటుంబసభ్యులకు బాధ్యతలు అప్పచెప్పాలన్న డిమాండ్ తెరమీదకు రావడంతో ఒక్కసారిగా వాతావరణం వేడెక్కింది. పార్టీ ఆవిర్భావ దినోత్సవం సందర్భంగా నగరంలో జరిగిన కార్యక్రమంలో అఖిల భారత ఎన్టీఆర్ అభిమాన సంఘాల అధ్యక్షుడు, మాజీ మంత్రి అయిన తాళ్లపాక రమేష్‌రెడ్డి ఈ వాదాన్ని విన్పించారు. తెలుగుదేశం పార్టీ రోజురోజుకు నమ్మకం కోల్పోతున్న పరిస్థితుల్లో చంద్రబాబు బాధ్యతల నుంచి తప్పుకొని బాలకృష్ణకు పార్టీ పగ్గాలు అప్పగించాలని, ముఖ్యమంత్రి అభ్యర్థిగా ప్రకటించాలని గళం విప్పారు. రమేష్‌రెడ్డి మాటలు ఆరోజు పెద్దగా పట్టించుకోకపోయినా, తర్వాత విజయవాడ తదితర ప్రాంతాల్లో దేశం నేతలు రాజీనామాలు, ఎన్టీఆర్ కుటుంబ సభ్యులకు ప్రాతినిధ్యం వ్వడం లేదన్న విమర్శలతో రమేష్‌రెడ్డి మాటల వెనుక చాలా పెద్ద మంత్రాంగమే నడిచిందని స్పష్టం అవుతుంది. ఇవి గాలి మాటలు కాదని రాష్ట్రస్థాయిలో ఒక వర్గం చంద్రబాబుకు వ్యతిరేకంగా, బాలకృష్ణకు మద్దతుగా ఈ నినాదాన్ని విన్పిస్తోందని విశ్లేషకులు అభిప్రాయపడుతున్నారు. ఈ పరిస్థితుల్లో జిల్లాలో సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిని మొదటి నుంచి రమేష్‌రెడ్డి, ఆయన అనుచరులు వ్యతిరేకిస్తున్న నేపథ్యంలో రానున్న రోజుల్లో ఇవి ఎలా మారనున్నాయో వేచి చూడాలి.

## అన్నా హజారే

5వ పేజీ కొరవ

చొక్కాలు తడిచి పోతున్నాయి. తమ కుర్చీల కాళ్లు కదలి పోతాయేమోనన్న భీతి వారిలో ప్రస్ఫుటంగా కన్పిస్తున్నది.

### తొలి వికెట్ శరద్ పవార్

కేంద్ర వ్యవసాయ మంత్రి శరద్ పవార్‌కు క్రికెట్ అంటే ఎనలేని పిచ్చి. కేంద్ర మంత్రిత్వం కంటే తాను అధ్యక్షత వహించే ఇంటర్నేషనల్ క్రికెట్ అసోసియేషన్‌కే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారాయన. ఆయన మోజు పడే క్రికెట్ పరిభాషలో చెప్పాలంటే, అన్నా హజారే ఉద్యమం ఫలితంగా నేల రాలిన తొలి వికెట్, శరద్ పవార్‌దే కావడం గమనార్హం. హజారే ఆందోళనను ఎదుర్కోవడానికి, అవినీతి నిర్మూలన చర్యలు చేపట్టే అధ్యయనం కోసం ప్రధాని ఒక ఉన్నతస్థాయి మంత్రుల కమిటీ ఏర్పాటు చేశాడు. దానిలో శరద్ పవార్ ఒక సభ్యుడు. మహారాష్ట్రలో రాజకీయ అవినీతితో వేల ఎకరాల భూములు సంపాదించిన శరద్ పవార్ సభ్యుడిగా వుండే కమిటీ ఏ అవినీతిని నిర్మూలిస్తుందని హజారే ఎగతాళి చేశాడు. ఆ ఒక్క మాటకు పవార్‌లో వణుకు పుట్టింది. క్షణం ఆలస్యం చేయకుండా ఆ కమిటీ సభ్యత్వానికి రాజీనామా చేశాడు.

### అరబ్ దేశాల అంటురోగం

ఇప్పుడు ప్రధానితో సహా ప్రభుత్వంలోని పెద్దలను కలవర పెడుతున్న అంశం – అరబ్ ప్రపంచాన్ని కల్లోల పరచిన ప్రజాందోళన తరహా ఉద్యమాలు మన దేశంలోనూ పుట్టుకొస్తాయన్న భీతి. అరబ్ ప్రపంచంలో తునీషియా ఒక నిరుపేద దేశం. అక్కడ పూటకు గతిలేని ఒక బడుగు జీవి, తన దుస్తులను పోలీసులు అన్యాయంగా పెరుక్కొన్నారనే ఆవేదనతో ఒళ్లు కాల్చుకొని ఆత్మహత్య చేసుకొన్నాడు. దానిపై ఆ దేశం మొత్తం ఆగ్రహంతో వూగి పోయింది. దాని ఫలితంగా ముప్పయ్యేళ్ల పాటు ఆ దేశాన్ని పాలించిన నియంత గద్దె దిగి పలాయన మంత్రం పఠించాడు. ఆ స్ఫూర్తితో ఈజిప్ట్ ప్రజలు తమ దేశాన్ని మూడున్నర దశాబ్దాలుగా పాలిస్తున్న హోస్నీ ముబారక్ మీద హింసా రహిత తిరుగుబాటు ప్రకటించారు. ఆయనా వూరు విడిచి వెళ్లక తప్పలేదు. ఇప్పుడు యెమన్, లిబియా, సిరియా, సౌదీ అరేబియా, మొరాకో, అల్జీరియా వంటి అరబ్ దేశాలన్నిటిలో ప్రజలు ప్రతిఘటన ఉద్యమాలు నడుపుతున్నారు. వాటి ధాటికి ఆయా పాలకులు తత్తరబిత్తర చెందుతున్నారు. దశాబ్దాల తరబడి సాగిన వారి పాలన పునాదులతో సహా కదలి పోతున్నది.

గత రెండేళ్లుగా దేశ ప్రజలను కలవర పరుస్తున్న అవినీతి కుంభకోణాల నేపథ్యంలో అన్నా హజారే చేపట్టిన సత్యాగ్రహం అరబ్ దేశాల అంటురోగం వలె రూపాంతరం చెందుతుందన్న భీతి రాజకీయవాదులందరిలో కన్పిస్తున్నది. అందువల్లనే ప్రధానితో సహా ఎవరికీ నిద్ర పట్టడం లేదు. తిండి సగించడం లేదు. హజారేను ఎట్లా నిలువరించాలనే పరిష్కారం దొరకక జుట్టు పీక్కొంటున్నారు వారందరూ.

## నడిచే దేవుడు కోలుకోవాలి

మొదటి పేజీ కొరవ

దొరికితే జన్మ ధన్యమౌతుందన్న తమకంతో నిరీక్షించే వారు కోకొల్లలు.

ఆయన్ను భగవంతుడి అవతారంగా నమ్మని వారు కూడా ఆయన పట్ల గౌరవభావంతో మెలుగుతారు. సమాజ సేవకుడిగా వందనం చేస్తారు. బాబా మహత్తు మీద ఎన్ని వివాదాలున్నాయో, ఆయన ప్రజా సేవ పట్ల అంత ఏకీభావం వుంది. విద్య, వైద్యం, త్రాగునీరు అనే మూడు రంగాలలో సత్యసాయి బాబా చేసిన సేవ అంతా ఇంతా కాదు. ప్రభుత్వాలు కూడా చేయలేని పని ఆయన సులభంగా చేస్తున్నాడు. పుట్టపర్తి, బెంగుళూరులలో ఆయన స్థాపించిన ఆస్పత్రులు అంతర్జాతీయ స్థాయి కల్గినవి. నిరుపేద అయినా, అపర కుబేరుడైనా ఆ ఆస్పత్రులలో ఒకటే రకం చికిత్స లభిస్తుంది. ఒక్క రూపాయి ఖర్చు లేకుండా గుండె, కిడ్నీ, లివర్ వంటి ఖరీదైన శస్త్ర చికిత్సలు ప్రతిరోజూ జరిగి పోతుంటాయి అక్కడ. డబ్బు ప్రస్తావనే వుండదు. అట్లని ధర్మాస్పత్రి తరహా కాదు. అపోలో వంటి కార్పొరేట్ ఆస్పత్రుల కంటే మిన్నగా వైద్య సేవలు లభిస్తాయి. దేనికీ లోపం వుండదు. అక్కడ పని చేసే సిబ్బంది కానీ, బాబా సేవకులు కానీ ఎంత చిత్తశుద్ధితో వ్యవహరిస్తారో వర్ణించి చెప్పలేము. తోటి పనిచేసే వాడు కూడా బాబా ధ్యానంలోనే వుంటాడు. వచ్చి పోయే రోగులు తమకు లభించిన సేవలకు కృతజ్ఞతగా ఎంత డబ్బు ఇవ్వబోయినా చేతితో ముట్టుకోరు. తమకు కావల్సింది బాబా ఇస్తాడని సమాధానం చెప్తారు. సత్యసాయి బాబా వైద్య సంస్థలు అంతర్జాతీయ ప్రమాణాలకు దీటుగా నడుస్తాయి. అక్కడ చదివిన విద్యార్థులు ఎంతో వున్నతికి ఎదుగుతున్నారు. అనంతపురం జిల్లాలోని అన్ని గ్రామాలకు త్రాగునీటి కరవు లేకుండా చేసిన అపర భగీరథుడాయన. ఆ తర్వాత అదే సౌకర్యం తమకూ కావాలని కోరిన ప్రతి జిల్లాలోనూ వందలాది కోట్లు ఖర్చు పెట్టి, పైప్ లైన్ నిర్మింప చేశాడు. మద్రాసుకు నీరిచ్చే తెలుగు గంగ కాలువకు రెండు వందల కోట్లతో సిమెంట్ లైనింగ్ చేయించాడు.

బాబాకు వున్న సేవా సంఘాలు, భజన మందిరాలు, కళ్యాణ మండపాలు, ఇతర సంస్థలు ఎన్నో లెక్క లేదు. ఆయన ఆస్తుల విలువ 40వేల నుంచి లక్ష కోట్ల వరకు వుంటుందని అంచనా. ఒక వ్యక్తి నడిపే ధార్మిక సంస్థకు ఇంత సిరిసంపదలు ప్రపంచంలో మరెక్కడా లేవు. బాబా సామాజిక సేవ ఎంత గొప్పదో, ఆయన తన భక్తులకు బోధించే ధర్మ ప్రవర్తన అంత కంటే మిన్న అయినది. కోట్లాది మందిని మంచి మార్గంలో నడిపించడం ఆయన సాధించిన అద్భుత విజయం. బాబాకు సంపూర్ణ ఆయురారోగ్యం సిద్ధించాలని, ఆయన సామాజిక సేవ ఇదే ప్రకారం మరి కొంతకాలం నడవాలని మనసారా కోరుకొంటున్నాము.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

డిఎస్పీ రాధిక సందర్శించారు.

### సాయిబాబా మందిరంలో శ్రీరామనవమి

నెల్లూరు గాంధీనగర్‌లోని షిర్డి సాయిబాబా మందిరంలో బాబా జన్మ దిన మరియు శ్రీరామ నవమి ఉత్సవాలు 12వ తేది నుంచి 14వ తేది వరకు జరుగుతాయి. ప్రతిరోజు ఉదయం ఏడు గంటల నుంచి బాబాకు మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకాలు, మధ్యాహ్నం సామూహిక అష్టోత్తర సహస్రనామ పూజలు జరుగుతాయి. ఈ కార్యక్రమాల్లో పాల్గొన కోరే భక్తులు దేవస్థానంలో సంప్రదించమంటున్నారు మందిరం ఛైర్మన్ మన్నెం అమర్‌నాథ్‌రెడ్డి.

### ప్రభవలో మెన్స్‌వేర్

నెల్లూరు పొగతోటలోని ప్రభవ పుస్తక భాండాగారంలోనే ఏర్పాటుచేసిన విశేష పురుష వస్త్ర శ్రేణి షోరూం 'కాన్ స్టెల్లో'ను 4వ తేదీ నగరంలోని సీనియర్ న్యాయవాది అనంతరామయ్య ప్రారంభించారు. ప్రభవ మాదిరిగానే కాన్‌స్టెల్లో జనాభిమానం పొందేలా చేస్తామన్నారు షోరూం అధినేత్రి చంద్రలత. ఈ కార్యక్రమంలో డాక్టర్ శ్రీధర్, కాశయ్య తదితరులు పాల్గొన్నారు.

### చిన్ని నారాయణరావుకు ప్రమోషన్

గత రెండు దశాబ్దాలుగా నెల్లూరీయులకు సుపరిచితుడైన కవి చిన్ని నారాయణరావుకు ప్రమోషన్ లభించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉగాదిని పురస్కరించుకొని హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో నిర్వహించిన కవి సమ్మేళనంలో చిన్ని నారాయణరావు పాల్గొనే అవకాశం ఇచ్చింది. "శ్రీ ఖరా... రావమ్మా రా...' శీర్షికతో ఆయన చదివిన కవిత అందరినీ అలరించింది. రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులు ఆర్వీ రమణమూర్తి, సాంస్కృతిక శాఖ కార్యదర్శి చెల్లప్ప ప్రభుత్వం తరపున నారాయణరావును సత్కరించారు.

### పెన్షనర్ల రాష్ట్ర సంఘం ఉపాధ్యక్షుడు

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ పెన్షనర్ల రాష్ట్ర కార్యవర్గ సమావేశాలు మార్చి 29, 30 తేదీల్లో గుంటూరులో జరిగాయి. ఈ సందర్భంగా జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో వ్యవసాయాధికారిగా ఉద్యోగ ప్రస్థానం మొదలుపెట్టి జాయింట్ డైరక్టర్‌గా రిటైర్ అయిన నెల్లూరీయుడు డాక్టర్ మోహన్‌రావును సంఘం ఉపాధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. నెల్లూరు జిల్లా పెన్షనర్ల సంఘం కార్యదర్శిగా మోహన్‌రావు చేసిన కృషికి గాను ఆయనకు రాష్ట్రస్థాయి పదవి వరించింది.

## జనవాణి

2వ పేజీ కొరవ

పరిస్థితీ అంతే. రైల్వే శాఖ తర్వాత ప్రపంచంలో అత్యధిక మంది ఉద్యోగులు పనిచేసే పోస్టల్ శాఖ నెల్లూరులో మరీ భ్రష్టుపట్టి పోయింది.

వాస్తు రామచంద్ర నెల్లూరు

## కడప ఉపఎన్నికనే ధ్యాస

మొదటి పేజీ కొరవ

న్నది కందుల రాజమోహనరెడ్డి కోరికలలో ఒకటి.

అభ్యర్థి నిర్ణయంలోనే ఇంతటి తడబాటు చూపుతున్న పార్టీలు ఎన్నికలలో జగన్‌ను ఢీకొనడంలో ఎంత వరకు సఫలీకృతం అవుతాయన్నది మిలియన్ డాలర్ల ప్రశ్న. రాష్ట్రమంతా వైఎస్ సానుకూల సానుభూతి పవనాలు వీస్తున్నాయన్న వార్తలున్నప్పుడు, కడప జిల్లాలో వాటి ఉధృతి మరెంత వుంటుందో అర్థం చేసుకోవచ్చు. ఆ సానుభూతికి తోడు జగన్ వద్ద కోకొల్లలుగా నిధులున్నాయి. ఈ ఎన్నికల కోసం వందకోట్ల రూపాయల వరకు అవలీలగా వెచ్చించే ఆర్థిక సంపత్తి వుంది. రాజశేఖర్‌రెడ్డి తన కుటుంబానికి అంత భారీగా ప్రజాధనం కొల్లగొట్టి ఇచ్చి వెళ్లాడు. మరొక ప్రక్క జగన్‌కు మీడియా బలం కూడా వుంది. సాక్షి టివి, సాక్షి పత్రిక, టివి5, ఐ న్యూస్, ఎన్‌టివి వంటి ఛానళ్లన్నీ ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ జగన్ నియంత్రణలో నడుస్తున్నాయన్నది బహిరంగ సత్యం. ఇంత విస్తృతమైన మీడియా వ్యవస్థ చేతిలో వున్న రాజకీయవాది మన రాష్ట్రంలో మరొకరు లేరు. అందువల్ల ఆయన తన వాదనను విస్తృతంగా ప్రచారం చేసుకోగలడు. ప్రత్యర్థుల నెత్తిన కుండలతో బురద క్రుమ్మరించగలడు. అందువల్ల జగన్‌ను ఎన్నికలలో ఢీకొనడం ఆషామాషీ వ్యవహారం కాబోదు.

అయితే జగన్ ఈ ఎన్నికలలో మంచి మెజారిటీతో గెలిస్తే, ఆయన వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి రాష్ట్రంలో ఇక అడ్డూఆపు వుండదన్నది నిజం. ఇక్కడి విజయోత్సాహంతో ఆయన రాష్ట్రమంతా రెచ్చిపోతాడు. అందువల్ల ఆయన్ను ఓడించలేక పోయినా, కనీసం మెజార్టీ తగ్గించే ప్రయత్నమైనా చేయాలన్నది టిడిపి, కాంగ్రెస్‌ల ఉమ్మడి లక్ష్యం. ఆ లక్ష్య సాధనకు ఇద్దరూ కలిసి పనిచేస్తున్నారన్న అభిప్రాయం ఒకటి ప్రచారంలోకి వచ్చింది. కానీ దీనివల్ల తన పార్టీ నిర్వీర్యమై పోతుందనే భయంతో చివరి నిముషంలో మైసూరారెడ్డి వంటి బలమైన అభ్యర్థిని రంగంలోకి దింపాడు చంద్రబాబు నాయుడు. లేకుంటే ఎవరో ఒక అనామకుడిని నిలబెట్టి, కాంగ్రెస్‌కు పరోక్ష సహకారం అందించాలనే ఆలోచన చేశారు.

ఇప్పుడు రంగంలోని అభ్యర్థులందరూ శక్తిమంతులే. కాంగ్రెస్ అభ్యర్థికి ముగ్గురు మంత్రుల మద్దతు లభిస్తున్నది. సహజంగానే అధికార పార్టీగా దానికి కొన్ని అనుకూలతలున్నాయి. దానికి తగినట్లే జగన్ కూడా తన శక్తియుక్తులన్నింటినీ కేంద్రీకరిస్తున్నాడు. అందరికంటే ముందు ఆయన ఊరూరు ప్రచారం మొదలు పెట్టేశాడు. మరొక ప్రక్క తన తల్లి విజయమ్మను కూడా ఎర్రటి ఎండలో తిప్పుతున్నాడు. ఈ మూడు శక్తుల ముమ్మర ప్రయత్నాల వల్ల కడప ఓటర్ల పంట పండబోతున్నది. నియోజకవర్గంలో కనీసం ఐదు లక్షల మంది ఓటర్లకు తలా వెయ్యి రూపాయల లెక్కన పంచాలని జగన్ ఏర్పాట్లు చేసుకొంటున్నట్లు చెప్తున్నారు. పులివెందుల శాసన సభ నియోజకవర్గంలో ఓటు విలువ రెండు నుంచి ఐదువేల వరకు వెళ్లవచ్చునని అంచనా. ఒక్క జగన్ పక్షానే ఈ ఎన్నికలలో వంద కోట్ల రూపాయల వరకు ఖర్చు కాబోతున్నది.

కాంగ్రెస్ కూడా దీనికి వెనుకబడే పరిస్థితి లేదు. వారు సైతం జగన్‌తో పోటీగా డబ్బు వెదజల్ల దానికి రంగం సిద్ధం చేస్తున్నారు. డబ్బు విషయంలో టిడిపి కొంత బలహీనం కాబోతున్నది. మరొక ప్రక్క ఫ్యాక్షన్ నేపథ్యం కల్గిన గ్రామాలలో నిప్పు రాజుకుంటున్నది. ముగ్గురూ బలవంతులు కావడంతో ఎవరో ఒకరి అండ చూసుకొని నిద్రాణమై వున్న ఫ్యాక్షన్ పగ్గాలు పెట్రేగ బోతున్నాయని పోలీస్ వర్గాలు భయపడుతున్నాయి. వాటిని నియంత్రించడంలో ఏ మాత్రం అలసత్వం చూపినా, కడప జిల్లా ఒక అగ్నిగుండంగా మారడం ఖాయం. ఎన్ని కుత్తుకలు తెగి నేలరాలుతాయో, ఎన్ని రక్తపు ముడుగులు ఏర్పడతాయో వూహించడం కష్టంగా వుంది.

● క్రికెట్‌లో ప్రపంచ కప్పు సాధించి

# జగజ్జేతగా నిలచిన భారత జట్టు!





**సమిష్టి విజయం**

ధోనీ సారధ్యంలో భారత జట్టు సాధించిన సమిష్టి విజయం ఇది. ఎంతోకాలంగా క్రికెట్ క్రీడాభిమానులు ఎదురు చూస్తున్న సుందర స్వప్నం ఫలించిన రోజు. ప్రపంచంలో భారత్ జట్టు సత్తా ఈ కప్ విజయంతో తెలిసొచ్చింది.

– కె.రమణారెడ్డి, వేదాయపాళెం.



**అభినందనీయం**

28 ఏళ్ల క్రికెట్ అభిమానులు కలసాకారం చేశారు టీమ్ ఇండియా సభ్యులు. కెప్టెన్‌గా ధోనీ నాయకత్వ పటిమ ప్రపంచానికి వెల్లడైంది. గత కొంతకాలంగా ధోనీపై విమర్శలు చేస్తున్న వారికి ప్రపంచకప్ సాధించడం ద్వారా గుణపాఠం చెప్పాడు.

–గుడ్లూరు రవిచంద్ర, సౌత్‌ఆములూరు.

భారతీయ క్రికెట్ అభిమానులు ఎప్పుడెప్పుడా అని ఎదురుచూస్తున్న కల ఫలించింది. 28ఏళ్ల సుదీర్ఘ విరామం తర్వాత 1983ను పునరావృతం చేస్తూ ప్రపంచకప్‌ను భారత్ గెలుచుకొంది. జగజ్జేతగా నిలచింది. 121 కోట్ల మంది భారతీయులు నిరీక్షణ ఫలించి భారత్ రెండోసారి ప్రపంచకప్‌ను సాధించింది. 1983లో లార్డ్స్ మైదానంలో కపిల్‌దేవ్ బృందం ప్రపంచ కప్ గెలుచుకొన్న 28 ఏళ్ల తర్వాత సొంత గడ్డపై విజయపతాకాన్ని రెపరెపలాడించింది. ఏప్రెల్ 2వ తేది సువర్ణాక్షరాలతో లిఖించదగిన రోజుగా నిల్చిపోయింది. అశేష భారతావని పులకించిపోయిన రోజు, జయహో భారత్ అని నినదించిన రోజుగా చెప్పొచ్చు. యావత్ దేశం సంబరాల్లో మునిగిపోయింది. దీనికి అనుగుణంగానే నెల్లూరు నగరంలోని క్రికెట్ క్రీడాభిమానులు చిన్నా, పెద్దా అన్న తారతమ్యం లేకుండా రాత్రి 11 గంటలకు వీధుల్లో కొచ్చి సందడి చేశారు. ప్రపంచకప్ విజయం ప్రజలందరికి విజయదశమి, దీపావళి, సంక్రాంతి, హోలి పండుగలన్నంటిని ఒకేసారి కలిపి తెచ్చినంతగా ఆనంద డోలికల్లో మునిగితేలారు. రంగులు చల్లుకొని, త్రివర్ణ పతాకాన్ని చేబూని పురవీధుల్లో కేరింతలు కొట్టారు. ఆనాడు కాల్చిన బాణాసంచా వెలుగులతో నగరం ధగధగలాడి పోయింది. ఈ చారిత్రాత్మక విజయంపై పలువురు అభిమానులు వెలువరించిన అభిప్రాయాలు ప్రక్కనిస్తున్నాం.




ప్రపంచ కప్పు గెలుచుకొన్న ఆనందోత్సాహంలో భారత క్రికెట్ జట్టు.

# విద్యుత్ ఛార్జీలు భరించలేం!



ఇటీవల రాష్ట్రప్రభుత్వం విద్యుత్ చార్జీలు పెంచి ప్రజలపై అదనపు భారం మోపింది. పెంచిన విద్యుత్ చార్జీలు ఈనెల ఒకటి నుంచి అమల్లోకి వచ్చాయి. వీధి దీపాలు, రక్షిత మంచినీటి సరఫరా పథకాలకు అదనపు వడ్డన పడింది. పది సంవత్సరాల తర్వాత విద్యుత్ చార్జీలు పెంచడంతో ప్రజలు ప్రభుత్వ వైఖరిని తప్పుపడుతున్నారు. ప్రధానంగా గృహవినియోగదారులకు ఎదురుదెబ్బ తగిలింది. ఇప్పటికే నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగి కొనలేని పరిస్థితిలో ప్రజలు సతమతమవుతున్నారు. ఈ క్రమంలో విద్యుత్ చార్జీలు పెంచడం పట్ల ప్రతిపక్ష పార్టీల నేతలు సైతం ప్రభుత్వంపై మండిపడుతున్నారు.

జిల్లావ్యాప్తంగా 10లక్షలకుపైగా విద్యుత్ సర్వీసులున్నాయి. గృహ సర్వీసులు 7,76,659. వాణిజ్యపరమైన సర్వీసులు 64,056. పరిశ్రమల సర్వీసులు 41వేలు, చిన్నతరహా పరిశ్రమల సర్వీసులు 30, వ్యవసాయ సర్వీసులు 1,14,070, వీధిదీపాలు 8,796, పంచాయితీలు 6,470 వున్నాయి. రాష్ట్రప్రభుత్వం 30 నుంచి 500 యూనిట్ల వరకు 50పైసలు, ఆపైబడిన యూనిట్లకు 75పైసలు వంతున పెంచింది. యూనిట్‌కు 30పైసలు పెంచిన ప్రభుత్వం సర్వీస్ చార్జీల పేరుతో ప్రజల నుంచి బాగానే వసూలు చేయనుంది.

50 యూనిట్ల వరకు 15 నుండి 20 రూపాయలు సర్వీస్ చార్జీ క్రింద చెల్లించాల్సి వుంటుంది. 100 యూనిట్లు దాటితే 35 రూపాయలు 300 యూనిట్లు పైబడితే 40 రూపాయలు సర్వీస్ చార్జీ విధించింది. ఉచిత విద్యుత్ సర్వీస్‌లు వున్నవారు కూడా ఇక నుంచి 30 రూపాయల సర్వీస్ చార్జీ క్రింద చెల్లించే విధంగా ప్రభుత్వం నిర్ణయించింది. సాధారణ ప్రజలతోపాటు ఈ దఫా పరిశ్రమలపై కూడా అదనపు భారం పడింది. విద్యుత్‌ను వాడినా, వాడకపోయినా సర్వీస్ చార్జీలను మాత్రం తప్పక చెల్లించాల్సి వుంటుంది. విద్యుత్ చార్జీలు పెంచడంపై జిల్లావ్యాప్తంగా నిరసనలు వ్యక్తమవుతున్నాయి. చార్జీలు పెంచినట్లు ప్రభుత్వం ప్రకటించడంతో జిల్లా కలెక్టరేట్ ఎదుట, వివిధ సబ్‌స్టేషన్ల ఎదుట ధర్నా కార్యక్రమాలు జరిగాయి.

## అదనపు భారం ఎనిమిది కోట్ల రూపాయలు

రాష్ట్ర ప్రభుత్వం పెంచిన విద్యుత్ చార్జీల కారణంగా జిల్లా ప్రజలపై దాదాపు 8కోట్ల రూపాయలు అదనపు భారం పడింది. వేసవి కాలంలో కొంత అధికంగానే విద్యుత్ వినియోగం జరుగుతుంది. గత నెల నుంచి జిల్లాలో విద్యుత్ కోత అమలు అవుతోంది. పట్టణ ప్రాంతాల్లో రెండు గంటలు, గ్రామీణ ప్రాంతాల్లో ఆరుగంటలు కోత విధిస్తున్నారు. ఈవిధంగా విద్యుత్ కోతలు విధిస్తున్న క్రమంలో కూడా విద్యుత్ సర్వీస్ చార్జీలు చెల్లించక తప్పదు. విద్యుత్ కోత కారణంగా గ్రామీణ ప్రాంతాలకు రక్షిత మంచినీరు సక్రమంగా సరఫరా జరగక ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు.

గ్రామ పంచాయితీలు నిధుల కొరత కారణంగా వీధిదీపాల విద్యుత్ చార్జీలు చెల్లించలేని పరిస్థితిలో వున్నాయి. విద్యుత్ బిల్లుతోపాటు, సర్వీస్ చార్జీలను భారీగానే పెంచడంతో మరింత అదనపు భారం మోయాల్సి వచ్చింది. ప్రభుత్వం పెంచిన విద్యుత్ బిల్లులు, సర్వీస్ చార్జీలను తగ్గించే విధంగా వివిధ రూపాల్లో ఆందోళన కార్యక్రమాలు చేపట్టాలని ప్రతిపక్ష పార్టీల నేతలు నిర్ణయించారు.

## అన్నా అన్నం మానేస్తే...

# అధికార పీఠం కదిలిపోతున్నది!

అయనేమీ రాజకీయవాది కాదు. ఏ ఎన్నికలోనూ ఎప్పుడూ పోటీ చేయలేదు. భూకామందు కాదు. చదువు లేదు. పెద్ద పెద్ద ఉద్యోగాలు చేయలేదు. ఆయన చుట్టూ మందీ మార్బలం లేదు. నూట ఇరవై కోట్ల మంది సగటు భారతీయులలో ఆయనా ఒకడు. పూటకు టికానీ లేని పేద వాడు. తనకంటూ స్వంత ఇల్లు, కుటుంబం లేని ఫకీర్. కానీ ఆయన ఢిల్లీ వీధులలో తిష్టవేసి, అన్నం తినడం మానివేస్తే యావత్ దేశంలో అనూహిత ప్రజా స్పందన వెల్లువెత్తుతున్నది. ప్రభుత్వ కుర్చీలు కదిలి పోతున్నాయి. అధికార పీఠంలో భూకం పాలు పుడుతున్నాయి. కొమ్ములు తిరిగిన ధీరులనుకొన్న వారు కూడా చలి జ్వరంతో వణికి పోతున్నారు. ఆయన పేరు అన్నా హజారే. ఆయన కోరేది – ప్రభుత్వంలో అవినీతి నిర్మూలన.

అన్నా హజారే గత మూడు రోజుల నుంచి ఢిల్లీలోని జంతర్ మంతర్ వేదిక వద్ద నిరాహార దీక్ష చేపట్టాడు. పాలకుల అవినీతిని అరికట్టడానికి, అవినీతికి పాల్పడిన వారిని కఠినంగా శిక్షించడానికి సమగ్రమైన, సమర్థవంతమైన లోక్‌పాల్ వ్యవస్థ ఏర్పాటు చేయాలన్నది ఆయన కోరిక.

### *43 ఏళ్లనాటి బిల్లు*

ప్రభుత్వంలో వుండేవారు బాధ్యతగా మెలగడానికి, ప్రజలలో వారి పట్ల విశ్వాసం పెంపొందించడానికి విస్తృతాధికారాలు కల్గిన విచారణ సంస్థ ఒకటి వుండాలన్న ఆలోచన స్వాతంత్ర్యం వచ్చిననాటి నుంచే వుంది. ఐరోపా దేశాలలో ఆచరణలో వున్న అంబుడ్స్‌మెన్ తరహా వ్యవస్థ వుండాలని భావించారు. దాని కనుగుణంగా 1968లో మొదటిసారి లోక్‌పాల్ బిల్లు లోక్‌సభలో ప్రవేశపెట్టారు. అయితే, అప్పట్లో కాంగ్రెస్‌లో చీలికలు రావడం, లోక్ సభ రద్దు కావడంతో రాజ్యసభ పరిశీలనలో వుండగానే ఆ బిల్లు రద్దయిపోయింది. ఆ తర్వాత 1971, 1977, 1985, 1989, 1996, 1998, 2005, 2008లలో ఈ బిల్లును ప్రవేశపెట్టారు. కానీ ప్రతిసారీ దాన్ని స్టాండింగ్ కమిటీ పరిశీలనకు పంపడం, అక్కడే సమాధి చేయడం ఆనవాయితీ అయిపోయింది. ప్రధాన మంత్రి, కేంద్ర మంత్రులు, రాష్ట్ర ముఖ్యమంత్రులు, పార్లమెంట్ సభ్యులు, శాసనసభ్యులు, వున్నత స్థానాలలో వుండే ఐఎఎస్, ఐపిఎస్ అధికారులు, సుప్రీంకోర్టు, హైకోర్టుల న్యాయమూర్తుల వంటివారు తప్పు చేస్తే, అవినీతికి పాల్పడితే చర్య తీసుకొనే వసతి ఈ చట్టాలలో లేదు. తమను తాము రక్షించుకోవడానికి ఈ పెద్దలందరూ చట్టాలలో ఎన్నో నిషేధాలు రూపొందించుకొని వున్నారు. ఎసిబి, సిబిఐ వంటి నేర పరిశోధనా సంస్థలు వీరిపై విచారణ జరపలేవు. దీనివల్లనే మన దేశంలో రాజకీయ అవినీతి పెట్రేగి పోయింది. తామేమి చేసినా అడిగేవారు లేరన్న ధీమాతో మంత్రులు, అధికారులు, రాజకీయవాదులు విచ్చలవిడిగా దేశాన్ని దోచుకొంటున్నారు. సైకిల్ కొనుక్కోవడానికి స్థోమత లేని దరిద్రులు కూడా ఎమ్మెల్యేలు,

కొరవ 5వ పేజీలో





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.